# ఆడపిల్ల శీలం విలువెంత?



అమ్మా, నాన్నా తననో ఇంటిదాన్ని చేయగల స్థితిలో లేరని తెల్సుకుందా అమ్మాయి. తన అక్క నడిచిన దారిలోనే తనక్కావాల్సిన వ్యక్తిని తనే వెదుక్కోవాలనుకుంది. పొరుగింటి సంసారిని బ్రహ్మచారిగా భ్రమపడి శీలాన్నతనికి అర్పితం చేయబోయింది... ఆ క్షణాన్న ఆమెను ఆదుకున్నవారెవరు? ఎవరా బ్రహ్మచారిలా నటించిన సంసారి? ఆ ఘర్షణ పర్యావసానం చివరికి ఎక్కడికి దారి తీసింది....? జూన్ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల కాటూరి రవీంద్ర త్రివిక్రమ్ రచన 'జగన్నాటకం'లో చదవండి.

-132 పేజీల పత్రికలో నెలనెలా ఒక సర్వసమగ్ర నవల కేవలం 125 పైసలకే అందిస్తోంది 'చతుర'. సచిత్రంగా రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో, నవల కాక అదనంగా చతుర మినీ కథలు, అద్భుతమైన చతుర ప్రపంచం కూడా మిమ్మలరిస్తాయి.

ప్రతినెలా 1వ తేదీకి వెలువడే నవ నవలా వేదిక

## చతుర

132 పేజీలు...125 పైసలే



Marketed By
Margadarsi Marketing PRIVATE LIMITED Eenadu Compound, Hyderabad-500 004

# అత్యుత్తమమైనవన్నీ లక్ష్మికే ఎలా సాధ్యం?

ఎంత మందికి ఇన్ని అవార్డులు లభిస్తాయి?
ఎంత మంది ఇంత చక్కగా నటించగలరు?
ఎంత మందికి ఇంత అందమైన కళ్ళుంటాయి?
ఎంత మందికి లక్స్‌తో ఇనుమడింపబడిన
ఆమెవంటి స్వచ్ఛమైన, కోమలమైన
చర్మ సౌందర్యం వుంటుంది?
హిందుస్తాన్ లివర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన

"నా మృదువైన, మనోహరమైన
చర్మ సౌందర్యపు రహస్యాన్ని ఎవరైనా
ఊహించవచ్చు. అదే లక్స్" అంటుంది లక్ష్మి.

Mm. Laxmi




శుద్ధమైన, సౌమ్యమైన లక్స్ -
సినీమాతారలకు
సౌందర్యాన్నిచ్చే సబ్బు.

హిందుస్తాన్ లివర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన

# అమ్మా! నాబూటు ఎంత బాగా మెరుస్తుందో చూడు.



## టింకూ లాంటి బాబు మీకూ వుంటే రీగల్ కావలసిందేమరి! ఇండియాలో అత్యధిక శక్తి గల డిటర్జెంట్ బట్టల సబ్బు.

టింకూ లాంటి పిల్లలు ఉంటే బట్టలు ఉతికే పని అధికం. అందుకు 'రీగల్' మాత్రమే సరియైన డిటర్జెంట్ సబ్బు. 'రీగల్'కు గల అధిక శుభ్రపరిచే శక్తి ఎంతటి మురికినైనా తొలగించి, మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, మెరుపుతోను మెరిసేలా చేస్తుంది. లోనికి చొచ్చుకొనిపోయి మురికిని తరిమివేయగల–శక్తివంతమైన–నురుగునిచ్చేది 'రీగల్'. ఇతర డిటర్జెంట్ సబ్బులన్నిటికన్న ఎక్కువ ఉతుకులు ఇచ్చే 'రీగల్,' మీకు ఎంతో పొదుపుచేస్తుంది.

'రీగల్'ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి.











ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 1972]

శుక్రవారం 8 6 '79

సిద్ధార్థినామ సం. వైశాఖ బహుళ త్రయోదశి

సంపుటము 72 · సంచిక 39

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
"ఇంటింట రామాయణం"లో ప్రభ

**కథలు, సీరియల్ కథలు :**

రాగరేఖలు ... 7
పులికూతురు ... 14
ఇది ఒక పాంథశాల ... 28

**వ్యాసాలు శీర్షికలు :**

ఉత్తరాలు - 4, ఆర్యభట-10, ప్రశ్నావళి 13, బొమ్మల మహాభారతం-19, సినిమా విశేషాలు 20 డాక్టరు సలహాలు-34, ధర్మపథం - 36, సామెతల కథలు-43, వంటలు - 44, పాలాక్షుని డైరీ - 47 వారఫలం-48 హైదరాబాదీ నోట్‌బుక్-50



# రాగరశ్మి

సీరియల్

'మాధవపెద్ది పుణ్యశీలా ప్రసాద్



## 6

రైలు ఆగింది. ప్రస్తుతంలోకి వచ్చాడు కృష్ణ. కిందికి దిగాడు. ఇంటికి వెళ్ళాలంటేనే విసుగ్గా వుంది. ఒక్కడే వుండాలి. వంట చేసుకోవాలి. మాట్లాడడానికైనా మనుషులు లేరు. శిల్ప వుంటే కాలం ఇట్టే గడిచి పోయేది? ఇంటికి వచ్చాడు.

స్నానం – భోజనం ముగించుకుని, మంచంమీద పడుకున్నాడు. అలసటతో నిద్ర పట్టేసింది– అతడికి. ఆ తరువాత రోజునించీ అతడి రొటీనతడికి ప్రారంభమయింది. మరో నాలుగు రోజులయ్యాక శిల్ప దగ్గర్నించి ఉత్తరం వచ్చింది.

'తను చాలా ఆనందంగా వున్నాననీ– ఇంటి వాళ్ళు ఎంతోబాగా చూస్తున్నారనీ– దాదాపు రోజూ వాళ్ళింట్లోనే భోజనం చేస్తున్నాననీ' – రాస్తూ, 'మీరు దగ్గర లేరనే బాధ ఒక్కటి తప్ప నేను హాయిగా వున్నాను.' అని రాసింది.

ఉద్యోగం చాలా బావుందనీ– ఎంతో ఇంటరెస్టింగ్‌గా వుందని కూడా రాసింది. ఆ వుత్తరం చదువుకుని ఎంతో ఆనందించాడు కృష్ణ. తన కంత కంటే ఏం కావాలి? శిల్ప ఆనందమే తన ఆనందం. శిల్పతో ఇంటిదాన్ని చేస్తే అప టికి నిజంగా తనకి నిశ్చింత! అనుకున్నాడు కృష్ణ.

* * *

అర్చన శిల్పకోసం ఎదురు చూస్తోంది. ఆరోజు శిల్ప, అర్చన సినిమా ప్రోగ్రాం వేసుకున్నారు. అది కన్నడ సినిమా, అర్చనే బలవంతం చేసి శిల్పని ఒప్పించింది. వరండాలో అటూ ఇటూ తిరుగుతోంది అర్చన. లేతాకు పచ్చరంగు నైలెక్స్ చీర– అదే రంగు జాకెట్ వేసుకుని వుంది ఆమె. తుమ్మెద రెక్కల్లాంటి ఉంగరాల జుట్టు

(గత సంచిక తరువాయి)

రెండు జడలుగా అల్లుకుంది. ఛామన ఛాయ రంగు. ఆకర్షణీయమైన ముఖం అర్చనది. శిల్ప – అర్చన ఒకరిని విడిచి ఒకరు ఉండలేనంత సన్నిహితులైపోయారు. శిల్ప వాళ్ళందరితో బాగా కలిసి పోయింది.

కన్నడం కాస్త, కాస్త నేర్చుకుంది. శిల్ప, అర్చన – ఎక్కడికి వెళ్ళినా కలిసే వెళ్తారు. స్వంత అక్కచెల్లెళ్ళకంటే మిన్నగా వుంటున్నారు. శిల్ప కొన్నిసార్లు వంటకూడా చేసుకునేది కాదు. అర్చన తల్లే బలవంతంగా చేసి తమతో తినిపించేది. శిల్పతో స్నేహం అయినప్పటినించీ అర్చన చాలా మారిందంటుంది అర్చన తల్లి వైదేహి.

కట్టులో– బొట్టులో–మాట తీరులో అన్నిట్లోనూ మార్పులొచ్చాయట: అంతకు ముందు బిడియంగా – మొహమాటంగా– మాట్లాడడం చేతకానట్లుండే అర్చన – ఇప్పుడు నిర్భయంగా – చాతుర్యంగా – మాట్లాడడం నేర్చుకుందిట! ఈ మాటలు శిల్పతోనేఅంటుంది వైదేహి. శిల్ప హాయిగా నవ్వుతుంది.

"నేను వెళ్ళేలోపల ఇంకా మారుస్తాను– అర్చనని–" అంటూంటుంది కూడా!

అర్చన ఆలోచనా సరళిలో కూడా మార్పు వచ్చింది. ఎక్కువగా పుస్తక పఠనం చెయ్యడం నేర్చుకుంది. ముఖ్యంగా శిల్ప దగ్గర నించి– మనకున్న 'టైము'ని ఏ విధంగా సద్వినియోగ పరుచుకోవాలో నేర్చుకుంది– అర్చన.

తను ఇవన్నీ శిల్ప దగ్గిర్నించీ నేర్చుకున్నందుకు గర్వపడుతూంటుంది అర్చన.

'ఆంటీ-అంకుల్' అంటూ వాళ్ళల్లో ఎంతో కలిసిపోయిన శిల్ప అంటే అర్చన తల్లిదండ్రులకి చాలా ఇష్టం! ఎంతో అభిమానం!

అర్చన– అర్జున్‌లు 'అక్కా' అని పిలుస్తున్నారు శిల్పని.

అర్చన తన పడకని కూడా శిల్ప రూములోకే మార్చేసింది, చదువుకోవాలంటూ. తెలియనివి శిల్పనడిగి చెప్పించుకుంటూ చదువు కూడా శ్రద్ధగానే చదవసాగిందామె. ముందుకంటే అన్నిట్లోనూ మంచి మార్కులు తెచ్చుకోసాగింది. అర్చన తల్లిదండ్రులకు శిల్ప అంటే ప్రేమానురాగాలు ఎక్కువయ్యాయి! అది అర్చనకి ఇంకా సంతోషం. తనకిష్టమైనవి తల్లిదండ్రులకి నచ్చకపోతే శిల్పచేత వారికి చెప్పించేది. ఆ విధంగా తన కోరిక తీరేది.

"అర్చనా... వర్షం వచ్చేటట్లుంది. ఇంకేం సినిమాకి వెళ్తారు? ఇవాళ్టికి మానెయ్యండి..." అంది వైదేహి.

ఇంకా శిల్ప రాలేదే అని చూస్తున్న అర్చనకి తల్లి మాటలు చికాకుని కలగజేశాయి. ఏదో జవాబు చెప్పబోయేంతలో– శిల్ప వచ్చింది.

"సారీ... అర్చూ అయిదు నిమిషాల్లో రెడీ అయి వస్తాను" అంటూ తన గదిలోకి వెళ్ళింది శిల్ప.

శిల్ప చాలా అలసిపోయి వుంది. నిజానికి ఆమెకి ఇప్పుడు ఒక కప్పు వేడి కాఫీ తాగి–

---

**జరిగినకథ 2 :** శిల్పకి బెంగుళూరులోని కెనరా బాంక్‌లో ఉద్యోగం రాగా, కృష్ణ అక్కడ చేర్పించటానికి వెళ్ళంటే రైలుకోసం పరుగెడుతున్న చిత్రను చూచి అతని మనస్సు గతంలోకి పరుగెడుతుంది. తల్లి ప్రసవ వేదనతో మరణించగా, తన తండ్రి అయిన వెంకట్రావ్‌ను చిత్ర ద్వేషించటం కృష్ణకు చిత్రంగా తోస్తుంది.

---



ఒక అరగంట పడుకోవాలనుంది. కానీ అర్చనని నిరాశ పరచడం ఇష్టం లేదు. ఇక్కడికి వచ్చినప్పటినించీ శిల్పకి కొత్త ఉత్సాహం వచ్చినట్లుగా వుంది. చిన్నప్పటి నించి ఆడతోడు లేకుండా పెరిగిన ఆమెకి వైదేహి ఆదరణ— అర్చన అప్యాయతా— అపురూపంగా— అమృతతుల్యంగా వుంది. వైదేహిలో మాతృ మమతనీ, అర్చనలో సహోదరి యొక్క వాత్సల్యాన్నీ చవి చూస్తోంది. అవి ఎంతో హాయిని కలిగిస్తూ వెన్నెటి జల్లులాగా వున్నాయి!

ఒక్క రోజు కూడా అవి లేకపోతే తను వుండలేదేమో అనిపించేంతగా అయిపోయిం దామె మనస్తత్వం. అందుకే అలసటగా వున్నా ముఖం కడుక్కుని రెడీ అయింది.

వైదేహి కాఫీ తెచ్చి ఇచ్చింది. తన మనసు కనుక్కుని అడగకుండానే కాఫీ తెచ్చిన ఆమెని చూస్తుంటే ఆత్మీయత పొంగి పొర్లింది శిల్పలో.

"థాంక్స్ ఆంటీ" మనస్ఫూర్తిగా అంటూ కాఫీ అందుకుంది.

చల్లగా నవ్వింది వైదేహి!

ముదురాకుపచ్చరంగు డ్రస్సులో— వన కన్యలాగా వున్న శిల్పని— ఆమె అత్యద్భుత సౌందర్యాన్ని కన్నులు విప్పుకుని చూస్తుండి పోయింది వైదేహి.

"నిన్ను చేసుకున్నవాడు అదృష్టవంతు డమ్మా శిల్పా!"

"థాంక్స్ ఆంటీ" నవ్వింది శిల్ప.

"కమ్ అర్చనా: అయామ్ రెడీ" వరండాలోకి వచ్చింది శిల్ప. కాఫీ తాగాక కాస్త అలసట తగ్గింది.

అర్చన కూడా లేచింది.

ఇద్దరూ గేటుదాకా వచ్చారు.

"హల్లో... అర్చనా..." ఒకయువకుడు ఎదురు వచ్చాడు.

"నువ్వా... మామయ్యా..." అంది అర్చన ఆగిపోయి,

"అమ్మా మామయ్యొచ్చాడు..." అంది పెద్దగా.

"అరే— అరుణ్... ఇదేనా రావడం?... రారా." వైదేహి గేటు దగ్గిరికి వచ్చి తమ్ముడ్ని ఆహ్వానించింది. ఆవిడ మొహం సంతోషంతో వెలిగిపోతోంది! శిల్పని చూస్తూ ఎవరన్నట్లు చూశాడు అక్క వైపు అరుణ్!

"ఈ అమ్మాయి మనమ్మాయే...మొన్న టొన్నే అద్దెకుంది. మన అర్చనకి ప్రాణ స్నేహితురాలు." వైదేహి చెప్తోంది కన్నులతో.

"పేరు... శిల్ప..." అంది అర్చన.

"శిల్ప..." అన్నాడు తనూ ఆ పేరును ఉచ్ఛరిస్తూ అరుణ్.

"వాట్ బ్యూటిఫుల్ నేమ్..." అప్రయత్నంగా అంటూ చేతులు జోడించాడు. శిల్ప కూడా నమస్కరించింది.

"శిల్పా...మా తమ్ముడు అరుణ్..." అంది వైదేహి.

శిల్ప సౌందర్యాన్ని మరోసారి చూడకుండా వుండలేక పోయాడు—అరుణ్.

"అర్చనా ఇప్పుడేం సినిమాకి వెళ్తారు లేవే. మామయ్యతో కాసేపు కబుర్లు

చెబుదువుగాని, ఇవాళ్టికి మానుకోండి. రేపు వెళ్ళచ్చు'' అంది వైదేహి.

అర్చన శిల్పవైపు చూసింది. శిల్ప ఏమనలేక పోయింది. ఆ పరిస్థితి ఇబ్బందిని కలిగించింది ఆమెకు. అందరూ ఇంట్లోకి నడిచారు. శిల్ప తన గదిలోకి వెళ్ళిపోయింది. అర్చన, వైదేహి, అరుణ్ లోపలికి వెళ్ళారు. వాళ్ళు కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటు న్నారు. శిల్పని ఒంటరితనం ఆవరించింది. ఆరోజు రాత్రి అర్చన శిల్ప గదిలోకి రాలేదు పడుకోడానికి అర్ధరాత్రి దాటేదాకా వాళంతా కలిసి కబుర్లాడుకుంటూనే వున్నారు.

నిద్రపట్టక బాల్కనీలోకి వచ్చిన శిల్పకి వాళు మాట్లాడుకునే మాటలు కొన్ని వినబడుతూనే వున్నాయి!

అరుణ్ అర్చనని ఏదో అనడం అర్చన నవ్వుతూనే "చూడమ్మా" అంటూ తల్లికి రిపోర్టు చెయ్యడం- "ఏం చూడ మంటావు-?" అంటూ వైదేహి అనడం విని నవ్వుకుంది శిల్ప!

* * *

శిల్ప మామూలుగా బ్యాంక్‌కి వెళ్ళి పోయింది పొద్దున్నే. అరుణ్ వచ్చినప్పటి నించీ ఇంట్లో అందరూ ఏవేవో ప్రోగామ్స్ వేసుకుని బయటికి వెళ్తూనే వున్నారు.

శిల్పని రమ్మని పిలుస్తూనే వుంది అర్చన. కానీ శిల్ప వెళ్ళేది కాదు.

వాళ్ళంతా తనకి తెలిసిన వాళ్ళే అయినా అరుణ్ కొత్తవాడేగా ?

పైగా వాళ్ళు మాట్లాడుకునే మాటల్ని బట్టి శిల్పకి కొన్ని విషయాలు చూచా యగా అర్థమయ్యాయి. అందులో ముఖ్య మయినది, అర్చనని అరుణ్ కివ్వాలని ఆమె తల్లి-తండ్రి-అభిప్రాయంలో వున్నారనేది! ఎందుకో గాని శిల్పకి అరుణ్ తనని చూసిన మొదటి చూపు కలవర పెడుతోంది! మర్చిపోలేకుండా వుంది! అతడు తన పేరుని మెచ్చుకోవడం పదే పదే గుర్తు కొస్తోంది. మర్చిపోలేని తన మనసంటే పరమ అసహ్య మేస్తోందామెకు. అందుకే వాళ్ళలో కలవ లేక పోతోంది తను.

అర్చన తన స్నేహితురాలు. తను వాళ్ళింట్లో అద్దెకున్నది. అంతే. అంతకన్నా ముందుకు పోగూడదు. అరుణ్ అట్లా చూడడంలో ఏదో భావం ఇమిడి వున్నట్లు తోస్తోంది తనకి. అవకాశమొస్తే చూపులు కలుపుతూ, చూపులతో పలకరిస్తూ వున్నాడు అరుణ్! శని, ఆదివారాల పండ గతో కలిసి మూడు రోజులు సెలవు లొచ్చాయి మరో రెండు రోజులు సెలవు పెట్టి హైదరాబాదు బయల్దేరింది శిల్ప.

## 7

ఒంటరితనంతో సతమతమౌతున్న కృష్ణకి శిల్ప రాక ఆనందాన్ని కలిగించింది.

"రామ్మా- రా. బాబాయిని చూడాలని పించిందా? అబ్బ ఎన్నాళ్ళయిందమ్మా నిన్ను చూసి? ఏమ్మా ఇంత చిక్కిపోయావు?" ఆప్యాయంగా ఆత్రుతగా అడుగుతున్న కృష్ణని చూడగానే కళ్ళల్లో నీళ్ళు తిరి గాయి శిల్పకి.

"ఏమిటి బాబాయ్. మీరిట్లా అయి పోయారు? అసలు భోజనం చేస్తున్నట్లు లేదే? నేను మిమ్మల్ని వదిలి వెళ్ళడంలో పొరపాటు చేశానేమో అనిపిస్తోంది నాకు... నా ట్రయినింగ్ అయిపోగానే... ఇక్కడికే పోస్టింగ్ వేయించు కుంటాను. ఇంక మిమ్మల్ని వదిలి వుండనే వుండను."

"ఉండవూ? పెళ్ళి చేసుకుంటే మీ ఆయన దగ్గిరికి వెళ్ళవూ?" నవ్వాడు కృష్ణ.

"నే నసలు పెళ్ళే చేసుకోనుగా?" నవ్వు తూనే లోపలికి వెళ్ళింది శిల్ప. స్వయంగా వంటచేసి కృష్ణకి వడ్డించింది శిల్ప ఎప్పటిలాగే! ఆరోజు చాలా రోజుల తర్వాత తృప్తిగా కడుపునిండా భోజనం చేశాడు కృష్ణ.

శిల్ప తను కూడా భోజనం చేశాక, కృష్ణ దగ్గిర కూచుని కబుర్లు చెప్ప సాగింది అర్చన గురించి, వాళ్ళ తల్లి దండ్రుల గురించీ పొగుడుతూ చెప్పింది.

"మరి నేను లేని టైములో మీరేం చేశారో చెప్పండి బాబాయ్" అంది చివరికి.

"నేనా? చెప్పమంటావా? నీకు పెళ్ళి సంబంధాలు వెతుకుతున్నాను" అని కాస్సే పాగి- "నువ్వు సరిగ్గా సమయానికే వచ్చావు. ఒక సంబంధం చూశాను. ఈ ఊరే-ఆ అబ్బాయి డాక్టరు. వాళ్ళు నిన్ను చూడ్డానికి వస్తామన్నారు. నీకు ఉత్తరం రాద్దామను కున్నాను నువ్వే వచ్చావు. రేపే రమ్మని వాళ్ళకి చెప్పి వస్తాను."

శిల్ప మాట్లాడలేదు. ఆమె కెందుకో అప్రయత్నంగానే అరుణ్ గుర్తొచ్చాడు. పొడుగ్గా, పొడుక్కి తగ్గ లావూ, ఉంగరాల జుట్టూ, విశాలమైన నుదురూ. అర్చన అదృష్టవంతురాలు అనుకుంది!

కృష్ణ చెప్పుకుపోతున్నాడు— "ఆస్తి పాస్తి వున్నవాళ్ళు. ముఖ్యంగా వాళ్ళది పెద్ద కుటుంబం. దేనికైనా బలగం వుంటుంది. అర్థబలం అంగబలం వుండా లంటారు మన పెద్దలు మామూలుగా."

శిల్ప వింటూ వుంది మౌనంగా. ఆ తరు వాత రోజు కృష్ణ మాట కాదనలేక అతడు చెప్పినట్లే ఆమె సింపుల్‌గా రెడీ అయింది



# నాలుగేళ్ళుగా తిరుగుతున్న ఆర్యభట

ప్రాచీన కాలంలోని సుప్రసిద్ధ ఖగోళ శాస్త్రవేత్త, గణిత శాస్త్రవేత్త ఆర్యభటు పేరుతో నిర్మించబడిన తొలి భారతీయ కృత్రిమ భూ ఉపగ్రహం నాలుగు సంవత్సరాల క్రితం కక్ష్యలో ప్రవేశపెట్టబడింది. సోవియట్ బూస్టర్ రాకెట్ సాయంతో, సోవియట్ కాస్మోడ్రోమ్ నుండి ప్రయోగించబడిన యీ ఉపగ్రహం యిప్పటికి 20 వేల సార్లకు పైగా భూ ప్రదక్షిణాలు నిర్వహించింది. ఈ ఉపగ్రహంలో అమర్చబడిన అధునాతన శాస్త్రీయ పరికరాలు నేటికీ సవ్యంగా పనిచేస్తూ వున్నాయి. ఏప్రిల్ 19తో, 3 సం. లు అంతరిక్షంలో యిది పూర్తి చేసింది.

ప్రస్తుతం భారతదేశంలో మరో కృత్రిమ భూ ఉపగ్రహం తయారవుతూ వుంది. ఆర్యభటలాగే యిది కూడా సోవియట్ భూభాగం నుండి, సోవియట్ బూస్టర్ రాకెట్ సహాయంతో కక్ష్యలోకి ప్రయోగించబడుతుంది జల వనరులు, అడవులు, ఖనిజ సంపదకు సంబంధించిన సమాచారాన్నీ, జాతీయ ఆర్థిక వ్యవస్థకు అత్యంత ముఖ్యమైన యితర సమాచారాన్నీ భారతీయ శాస్త్రవేత్తలు సేకరించడానికి యీ ఉపగ్రహం వారికి తోడ్పడుతుంది.

అంతరిక్షపరిశోధనారంగంలో సోవియట్, భారతీయ శాస్త్రవేత్తలు సమిష్టిగా కృషిచేసి ఫలితంగా నేడు భారతీయ శాస్త్రవేత్తలు అత్యంత జటిలమైన శాస్త్రీయ, సాంకేతిక సమస్యలను వారంతట వారే స్వయంగా పరిష్కరించే విజ్ఞానాన్నీ, నేర్పునూ సంపాదించారు.

వచ్చే సంవత్సరం భారతదేశం తన స్వీయ కృషితో తొలి కమ్యూనికేషన్ ఉపగ్రహాన్ని నిర్మించుకుంటుంది. అది భారతదేశంలో కమ్యూనికేషన్స్ వ్యవస్థ అభివృద్ధికి విస్తారమైన అవకాశాలను కల్పిస్తుంది. వాతావరణ పరిశోధనా రాకెట్ల సాయంతో వాతావరణంలోని పై పొరలను అధ్యయనం చేయడంలో మహత్తరమైన పురోగతి సాధించబడింది ఈ రాకెట్లు, కేరళ రాష్ట్రంలోని తుంబా అంతరిక్ష కేంద్రం నుండి ప్రయోగించబడుతూ వున్నాయి. సోవియట్ ప్రవీణుల సాయంతో యీ కేంద్రం స్థాపించబడింది.

---

పెళ్ళిచూపులకని! కృష్ణ పళ్ళు, పూలు, స్వీట్లు, హాట్లు అన్నీ బజారునించి తెచ్చాడు. శిల్పకి పెళ్ళిచూపు అంటేనే అతడికెంతో సంతోషంగా వుంది. ఇదే మొదటిసారి. ఇదే చివరిసారి కావాలి. శిల్ప కూడా పాపం నవ్వుకుంది. అంతే చాలు. ఇది కుదిరితే బావుంటుంది. తన శక్తివంచన లేకుండా జరిపిస్తాడు పెళ్ళి కట్నకానుక లేమైనా ఇస్తాడు ఏ లోపమూ రానివ్వడు తను. పెట్టుపోతలు ఉన్నంతలో ఘనంగానే చేస్తాడు. అదే చెప్పాడు వాళ్ళకి గూడా!

వాళ్ళదీ మంచి కుటుంబం. కుర్రవాడు బుద్ధిమంతుడు. తనకు తెలిసినంత వరకూ ఏ చెడ్డ అలవాట్లూ లేవు. వాళ్ళు అయిదున్నరకల్లా వస్తామన్నారు.

ఇల్లంతా చక్కగా అలంకరించింది శిల్ప వస్తూనే! అందుకని మళ్ళీ సర్దాల్సిన అవసరమే లేకపోయింది.

కృష్ణ, శిల్ప హాల్లో కూర్చుని ఎవరి ఆలోచనలలో వాళున్నారు. అయిదున్నర అయింది వాళ్ళే క్షణంలోనయినా రావచ్చు. శిల్ప లేచి లోపలికెళ్ళింది. కృష్ణ ఆత్రుత పడసాగడు. మాటి మాటికీ వీధిగుమ్మంలోకి చూడసాగాడు అయిదున్నర దాటింది. ఆరవుతోంది వాళ్ళు రాలేదు అప్పటికీ. కృష్ణ వాకిట్లోకి వచ్చి గేట్లోనే నుంచున్నాడు ఎదురుచూస్తూ.

## రాగ రేఖలు

[ ఎంతకీ రాలేదు వాళ్ళు. ఆరున్నర ఏడు. అయినా రాలేదు వాళ్ళు! ఇంక రానట్టే. నిరాశగా నిట్టూర్పు విడిచాడు. లోపలికివచ్చి కుర్చీలో కూలబడ్డాడు. పూలు, పళ్ళు వెక్కిరిస్తున్నట్లు కనబడ్డాయి! మనసంతా ఆందోళన దిగులు! కళ్ళు మూసుకుని వెనక్కి వాలాడు! తనను తాను సంబాళించుకుని తేరుకునేటప్పటికి టైము తొమ్మిది దాటింది. లేచి వంటింట్లోకి వచ్చాడు.]

మోకాళ్ళ చుట్టూ చేతులు వేసుకుని మోకాళ్ళమీద తల ఆన్చి కూర్చుని ఏదో ఆలోచిస్తూనే వుంది శిల్ప!

"శిల్పా–" నెమ్మదిగా పిల్చాడు.



ఉలిక్కిపడిన శిల్ప లేచి నుంచుంది. మౌనంగా ఇద్దరికీ కంచాలు పెట్టింది. అన్నం వడ్డించింది.

* * *

ఆ తరువాత వాళ్ళు ఎందుకు రాలేదో తెలిసింది కృష్ణకి. కానీ శిల్పకి మాత్రం చెప్పలేదు. తనలో తానే కుంగిపోయాడు. కుమిలిపోయాడు! నిరాశపడ్డాడు. నిస్పృహ చెందాడు! ఇంక తను శిల్పకి పెళ్ళి చేయలేమోనని భయపడ్డాడు! దిగులు కలిగింది! ఆలోచించిన కొద్దీ పిచ్చెక్కినట్లవుతోంది అతడికి!

ఒక మంచి పని చెయ్యడానికి ఎన్ని అడ్డంకులు? ఎన్ని అవమానాలు? ఎన్ని అవహేళనలు? ఎన్ని అపహాస్యాలు? ఎన్ని ఎదురు దెబ్బలు?

ఈ లోకం మీద చెప్పలేని కసికలిగింది! ఏదో చేసెయ్యాలనే ద్వేషం రగిలింది! తన నవమానించిన ప్రతి వ్యక్తినీ ముక్కలు ముక్కలుగా నరికెయ్యాలి! తన నవహేళన చేసిన ప్రతివాడి గొంతు పిసికెయ్యాలి! తన్నపహాస్యం చేసిన ప్రతి మనిషి నోరూ నొక్కెయ్యాలి! ఆవేశం పిచ్చి ఆవేశం కలుగుతోంది! లేకపోతే... లేకపోతే – తన కూతురు కంటే ఎక్కువయిన శిల్పకీ– తనకీ...ఛీ...ఛీ ఎంత నీచం ఎంత నీచమైన సంబంధం అంటగడుతున్నారు? ఆడా మగా

## రాగ రేఖలు

కలిసి వుంటే ఇంక వాళ్ళిద్దరి మధ్యా వుండే సంబంధం 'అదే'నా...? ఇంకేమీ కాదా?

శిల్ప తిరిగి వెళ్ళేదాకా గూడా మామూలు మనిషి కాలేకపోయాడు కృష్ణ.

ఆమె వెళ్ళిపోయాక జరిగింది తల్చుకుంటే, శిల్పని గురించి ఆలోచిస్తుంటే తెలియని వ్యధ కలుగుతోంది కృష్ణకి.

ఏ విధంగా ఆ బాధ పోగొట్టుకోవాలో రేగుతున్న ఆ మంటని ఎట్లా చల్లార్చుకోవాలో తెలియడంలేదు. మంచిగంధం, పన్నీటిజల్లు ఎట్లా వస్తాయి తన జీవితానికి? తన ఈ మానసిక చిత్రవధ నించి శాశ్వతంగా దూరమవాలంటే ఈ బాధకి ఉపశమనం కలగాలంటే తను గతస్మృతులలోకి దిగ్గాలి! చిత్రతో తను గడిపిన కొన్ని మధురక్షణాలు అవే అమృత గుళికలు!!

అదే అదే అంతకంటే గత్యంతరం లేదు తనకి. పెళ్ళయిన చిత్రని తల్చుకోకూడదు నిజమే! కానీ తన ఊహల్లో ఉన్న తన చిత్రకి ఇంకా పెళ్ళికాలేదు. ఆ చిత్ర వేరు. అవును వేరు.

(ఇంకా వుంది)




**వి. విఎం. ఆర్ ఆర్. కాకినాడ**

అధికార దాహానికి అంతులేదా?

ఎలా వుంటుంది? అతి సుహాసనా బరిలస్త్యన మనోవికారం ఒక్క అధికార దాహమే!

**పి. వి జి ప్రకాష్ విజయవాడ**

స్త్రీకి సమాజంలో కల విలువ నేడు ఏమిటి?

వస్తువుగానో శరీరంగానో మాత్రమే చూడ బడుతున్న స్త్రీకి విలువే ముంటుంది స్వామీ. ఆడదాని విలువ ఈనాటి దక్షిణ భాషా చిత్రాలు అద్దం పట్టి చూపుతున్నాయి కద! మళ్ళీ నన్నడగడం, నాచేత వాగించడం దేనికి?

**జె వి. ఆర్. శ్రీకాకుళం**

ఒక ఆహ్వాన సభలో శ్రీ ఆరుద్రగారు 'నాకు అందంలేదు. నా పెళ్ళానికి పుస్తెలులేవు' అని అన్నారు. మీరేమంటారు?

శ్రీ ఆరుద్రగారు అబద్ధం ఆడరంటాను!

**సుభాషిణి గుండమూరంక**

ఈమధ్య మీరేం నవల్సు రాస్తున్నారు? ఏదీ సీరియల్ ప్రచురించలేదేం?

మొన్న ఆ మధ్యనేగా. ఇదిగో కోటిగాడు ముగిం చానా? గుండక్షణ రాయడం ప్రారంభించాను. ముగిసాక సీరియల్‌గా యిస్తాను. . . .

**వి. సి పి ఆర్. వంగవూరు**

ప్రేమకోసమై వలలో పడెను పాపం పసివాడు అన్నారు ప్రసిద్ధకవి. ఆ పసివాడు ప్రేమవలలోపడ్డం ఏమిటి?

పసివాడంటే పాపం! అమాయకుడని కవితార్థం అయినా వలవిసిరే మగవాడు వల్లో పడ్డం ఏమిటి?

**జె ఎఫ్. ఒంగోలు**

పూర్వజన్మ గుర్తుకి వస్తే ఏం చేస్తారు మీరు? అలాగే నేను ఏం చెయ్యాలి?

మీరేం చెయ్యాలో నేను చెప్పలేనుగాని. . . . నేను మాటకు డబ్బుచేసుకుంటాను!

**విన్. ఏ ఆచంట**

వాసిలకథలో సీత అక్క ఎవరు?

మనోసీతకథ కూడా వచ్చేశాక యీ ప్రశ్న అడగడం?! శుభ. . . . అయినా సినిమాల విషయంలో నేనింత చురుకు — మిగతావాట్లలోకూడా యింతేనా?!

**బాల, లక్ష్మి; జయ; మచిలీపట్నం**

మొన్న విజయవాడలో జరిగిన కథారచయితల సమ్మేళనంలో లత, చివుకుల పురుషోత్తంగారలు ఒకచోట చేరి మిమ్మల్ని గురించి అసభ్యంగామాట్లాడు కుంటున్నారు. అదివిన్న మేము వాళ్ల ఆటోగ్రాఫులు తీసుకోకుండానే తిరిగివచ్చాం. మీ రంటే వాళ్ల కెందుకంత కోపం?

మీరింకా చిన్నపిల్లల్లా వున్నారు!! లత తిట్టు తూందంటే అర్థం వుంది— కాని ఆ చివుకుల పురు షోత్తం గారెవరబ్బా — వారిముఖపరిచయం కూడా లేదే— నాకు! మరచిపొండి— ఆరోజు నన్ను తిట్టు కున్నారు. నన్ను కాకపోతే యింకోళ్లని ఆడిపోసుకునే వాళ్ళు. . . . అదంతా సాహితీ సభ్యత.

**జె. బి. ఆర్. మొలగవల్లి**

ప్రేమగుడ్డిది. కామం చెడ్డది. అంటారు. ప్రేమలో మంచి లేదంటారా?

ఎందుకు లేదు. గుడ్డిప్రేమ మంచిదే. కారణాలు అడిగితేనే గొడవ. కామం నిజ జీవితంలో తప్పు! సినిమా కథలకి గిరాకీ అంచేత అదీ మంచిదే.

స్త్రీని పూవుతో పోలుస్తారెందుకు?

జీవితంలో ఏ ఇతర ఆశయం లేకుండా పెళ్లే ధ్యేయంగా వుంటే ఇట్టే వాడిపోతుంది కనుక! చూస్తున్నారుగా— మధ్య వయస్సు వస్తే ఆడది ముసిల్ది! మగవాడు కొత్తవేటగాడు! చెంపలునెరిస్తే మగవాడిని 'చార్మింగ్' అంటారు. ఆడదాని జుట్టు నెరిసింది అంటారు! మగవాడు అరవై దాటినా వాడి పోడు. పిల్లల తల్లికాగానే స్త్రీ పండిన చెట్టులాగా పంగకతప్పదు! దానిలోనూ అందం చూడకలడు ప్రేమించే మగవాడు.

**ఎస్. ఎస్. మంగళగిరి**

ఎంతిచ్చి మీతో మీ భర్తని కొనుక్కున్నారు? ఇప్పుడు పెళ్లిళ్లు చేసుకునే కన్యలకు మీరు ఇచ్చే సందేశం?

నేను మనసిచ్చి భర్తని చేసట్టాను. డబ్బిచ్చికాదు. డబ్బిచ్చి పెళ్లిచేసుకునేకంటే స్వేచ్ఛగా గౌరవప్రదంగా కన్యలుగా బ్రతకడం మంచిది— పౌరుషంలేని మగ వాడితో బ్రతుకు పంచుకోడం కంటే— పెళ్లి కాకుండా వుండడం మెరుగు. పసుపుతాడు కోసం మెడచాచే ఆడపిల్లలీనాడిక్కడ అక్కడా మగదిక్కులో కన్పిస్తున్నారే గాని నిజజీవితంలో కాదు. తల్లి తండ్రులు ఆడపిల్లలకి మగపిల్లలతో సమానంగా చదువులు చెప్పిస్తున్నారు. బాగుంది. పెళ్లిదగ్గిర కొచ్చేసరికి బేరాలు దేనికి? తమకున్న ఆస్తి పాస్తులను అందరి పిల్లలకీ సమానంగా పంచరాదా? అప్పుడీ గొడవలే వుండవు కద! చదువుకుని, ఉద్యో గాలు చేస్తూ కూడా నెత్తిన డబ్బెట్టి అమ్మించుకో వాలా ఆడపిల్లలు? - కట్నానికి కారణం అబ్బాయి లొక్కరేకాదు— అమ్మాయిల తల్లిదండ్రులు కూడా. డబ్బిచ్చి వదుల్చుకోవాలని చూడ్డం ఆడ పిల్లలని భారంగా భావించడం కదా!

**పి. జి. ఆర్. విజయవాడ**

అందమున్న ఆడదానికి గర్వం ఎక్కువ అంటారు. దీనికి మీరేమంటారు?

అందం శాశ్వతం కాదని తెలియక ఆ గర్వం. కాని నేర్పరి అయిన ఆడదానిగర్వం— స్వాతిశయం— అందం లేకపోయినా అందాన్ని తెచ్చిపెడతాయి ఆడదానికి.




"పున్నయ్య పులిలాంటివాడు-" అని ఆ వీధిలో వారందరూ అంటారు. దానికి కారణం సుందరి! సుందరి పున్నయ్య ఏకైక పుత్రిక. దంత సుందరిలానో.. నల్ల సుందరిలానో...మెల్ల సుందరిలానో ఉండదు సుందరి! సృష్టికర్త... విశాల విశ్వంలోని అందాన్నంతా ఒక్కచోట పోగుచేసి తీరుగా మలిచిన సుందర శిల్పంలా ఉంటుంది. ఆమెని చూస్తే చాలు! యువకులగుండెల్లో కోటి కోరికలు జివ్వున లేస్తాయి! ముసలి వాళ్ళు తమ వయస్సుని ఓ పాతికేళ్ళకి తగ్గించుకుని (ఊహలో మాత్రమే!) లొట్టలేస్తూ వుంటారు. ఈ సంగతి తెలియని వాడేమీకాదు పున్నయ్య! అనుమానం ముందు పుట్టి తరవాత పుట్టాడు పున్నయ్య! అందుకే సుందరికి ఎన్నో కట్టుబాట్లు విధించాడు. వాటి ప్రకారం–సుందరి వాకిట్లోకి రానే కూడదు – పాలవాడు, కూరలవాడు, లాంటి తప్పనిసరి వాళ్ళు వచ్చి పిలిచిన సమయాల్లో తప్ప. నిజానికి సుందరిని పిలిచేది పాలవాడు కూరలవాడు కాదు. పున్నయ్య చేసిన ఏర్పాటువల్ల – పాలు పోసేది.. కూరలమ్మేది. మాత్రమే పిలుస్తారు.

ఆన్సర్ టుది పాయింటులాగ...వచ్చిన పని చూసుకుని వెంటనే లోనికి వెళ్ళిపోవాలి సుందరి! మార్కెట్టుకి వెళ్ళి కూరగాయలు తేవటం గానీ ... షాపింగ్ చేసి బట్టల పాకెట్లు తేవటం గానీ...ఏవీ చేయకూడదు. అవన్నీ పున్నయ్యే స్వయంగా చూస్తాడు! చేస్తాడు! పున్నయ్య బజారు కెళ్ళేది కాసేపే...! రిటైరయి పోయాడు గనక– మిగతా సమయమంతా ఇంట్లోనే గడిపేస్తుంటాడు. అతను ఇంట్లో లేని కాసేపటిలో సుందరి బజారు గుమ్మంలోంచి తొంగి కూడా చూడరాదు!

ఇన్ని ఆంక్షల్ను పెట్టాడంటే...సుందరి మీద ప్రేమ లేదని కాదు. తల్లిలేని సుందరి అంటే వల్లమాలిన అపేక్ష పున్నయ్యకి. ఆడ పిల్లకి... అందులో తల్లిలేని పిల్లకి...స్వేచ్ఛయిస్తే ఏం జరుగుతుందోననే భయం! తను మామూలుగా చూసీ చూడనట్టుంటే, ఆ పేటలోని కుర్రకారు లోకువ తీసుకుని తన అందాల కూతురు సుందరిమీద వలపుల వలలు విసురుతారని ఆ మోసపుటుచ్చుల్లో అభం శుభం ఎరుగని కన్నెపిల్ల చిక్కుకుంటుందనే అనుమానం పున్నయ్యకి.

అందుకనే పులిలా ఉండటానికి నిశ్చయించుకున్నాడు పున్నయ్య. తన వాకిట్లోకి చిన్నా.. పెద్దా...ఏ మగ పురుగు వచ్చినా పులిలా గాండ్రిస్తాడు! సింహంలా గర్జిస్తాడు! మాటల్ని ఈటెలుగా మార్చి పొడిచి పొడిచి మరీ వదులుతాడు.

సుందరి అందాన్ని తాగేయటం సంగతలా వుంచి...ముందు ఈ పుష్పరాగాడు తమని కోపంతో తినేసేట్టున్నాడని గ్రహించి ఉడాయించేవారా మగ పురుగులు! జబ్బ చరుచుకుని, దుబ్బుమీసాలు మెలేసేవాడు పున్నయ్య ఒక్క మాటలో చెప్పాలంటే... సుందరిని దాదాపు ప్రమీలా రాజ్యంలో (అంటే







ఎవిక్స్ బట్టలకు తెల్లదనాన్ని, తళతళను కలిగించేందుకు సరిక్రొత్త మార్గం.
ఎవిక్స్‌తో మురికి వదిలి పోతుంది.
ఎవిక్స్ లో తెల్లదనాన్ని అందజేసే శక్తివంతమైన పదార్థం ఉంది. అది మీ బట్టలకు ఇంతకు ముందెన్నడూ లేనంత తెల్లదనాన్ని, తళతళను సమకూరుస్తుంది.
ఎవిక్స్ ప్రత్యేకంగా సూత్రీకరింపబడింది. ఇది ముద్దగా కాదు, గరుకుగా అయిపోదు.
ఎవిక్స్ ఒకే ముక్కలా పడుంటుంది గనక పూరిగా అరిగిపోయేదాకా వాడేవీలు.
ఎవిక్స్‌తో మీరు ఎక్కువ బట్టలను ఉతికే సదుపాయమూ, పొదుపుచేసే అనువు. నిజానికి డిటర్జెంట్ సబ్బు బిళ్ళలు అలా ఉండాలనేగా మీరు కోరుకునేది—అందుకే నేడే కొనండి.

ముద్దగా అయిపోని
ఎవిక్స్
నీలిరంగు డిటర్జెంట్ కేక్
చాలాకాలం ఆటేవచ్చేది

CHAITRA-G-97 TEL

పంజరం అనొచ్చునేమో?) ఉంచే వాడు పున్నయ్య. అందుడిగా తను తప్ప ప్రమీలతో మాట్లాడే వాళ్ళందర్నూ ఇరుగు పొరుగు [illegible]!

అలాంటి ప్రమీలా రాజ్యంలోకి ఓ శుభ ముహూర్తాన– అడుగు పెట్టాడో యువకుడు అతడు అర్జునుడు లాంటి వాడో కాదో గానీ... అతని పేరు మాత్రం ఆనంద్!

వస్తూనే పున్నయ్య పాదాలంటి నమస్కారం చేశాడు. తన మెళ్ళో పూల దండ వేసి తనని సత్కరించినట్టుగా పొంగిపోయాడు పున్నయ్య! కానీ... వీడు మగ పురుగు! (తనేపురుగో మరి!) అందులోనూ మిసమిసలాడే కోడె వయస్సులో ఉన్న అందమైన మగపురుగా!! వీడు తప్పకుండా... పుత్తడి బొమ్మలాంటి తన కూతురితో పరిచయం కోసం...వీలుంటే ఆమెను లోబరుచుకోటం కోసమే వచ్చి ఉంటాడు. పిచ్చి సన్నాసి! ఈ పున్నయ్యంటే ఏమనుకున్నాడో వెధవ? పులి! పులి...! హనుమంతుడి ముందా కుప్పిగంతులన్నట్టుగా తనముందా పిచ్చి వెధవ వేషాలు! వీడి ఆట కట్టించాలి ఈ క్షణంలోనే! అనుకున్నాడు.

"ఏ! ఏం తప్పు చేశావని నా కాళ్ళు పట్టుకున్నావ్?" – పున్నయ్య పులిలా గాండ్రించాడు.

దొంగచాటుగా కిటికీలోంచి ఈ దృశ్యమంతా చూస్తున్న సుందరి ఉలిక్కిపడి కాస్త పక్కకితప్పించుకుని ఆ సీను ఆసక్తిగా తిలకించసాగింది ఎంత అందంగా ఉన్నాడతను? అంటోందామె మనసు పళ్ళబుట్ట పట్టుకుని నిలబడ్డ రిక్షావాడుకూడా ఉలిక్కిపడ్డాడు పున్నయ్య గర్జనకి.

ఆనంద్ ఏమీ కంగారు పడలేదు- పులి గాండ్రింపుకి. లేచి సవినయంగా నిల్చున్నాడు. పళ్ళబుట్ట అక్కడ పెట్టమని రిక్షావాడికి చేత్తోనే సంజ్ఞ చేశాడు. డబ్బులు ముందే ముట్టిన రిక్షావాడు బుట్టక్కడ పెట్టి వెళ్ళిపోయాడు– వెనక్కి తిరిగి చూసుకుంటూ.

"నిన్నే అడుగుతుంట! నోరు లేదా? మాటలు రావా? ఆ పళ్ళెవరికి? ఎందుకిన్ని? అయినా ఈ కాకాలు...బాకాలు...నా దగ్గర చెల్లవ్ తెలిసిందా? ఇంతకి నువ్వెవరు?" పున్నయ్య మాటల్లో ఘాటు పాలు ఎక్కువగానే ఉంది!

అతి నెమ్మదిగా సమాధాన మిచ్చాడా

# పులి కూతురు

యువకుడు –"నేనెవరో...ఏమిటో...చెప్పే ముందు మీరన్నట్టుగా నేను చేసిన తప్పు ఒప్పుకోవాలి సార్! ఒప్పుకు తీరాలి! నన్ను తమరు క్షమించానంటే–నా గురించి చెప్పుకుంటాను."

అతని వినయ విధేయతలకి – పున్నయ్య లోని పులి కొచ్చినకోపం సగం చల్లబడింది. కానీ దాన్ని పైకి ప్రకటించటం ఇష్టం లేదు–

"వచ్చిన వాడికి చెప్పుకోవలసిన అవసరం వుంటుందని తెలీదూ? దానికి నిన్ను నేను

## అందాల మేడలు

కల వారి పిల్లలు
బడి పిల్లలా!
లేని వారి పిల్లలు, వారి
పని పిల్లలా!
దేశం మరమ్మత్తు
పైనుంచికాదు
మహా ప్రభో
ప్రారంభించేది
అడుగు నుంచి
పునాదులు బీటలు వేస్తే
అందాల హార్మ్యాలైనా
గోవిందో హరి అనక తప్పదు!

కోట పాల్‌దేవరాజు

బొట్టు కాటుక పెట్టి బతిమాలాలా?" గంభీరంగా అన్నాడు.

మళ్ళీ మొదలు పెట్టాడతను.

"నేను ఒట్టి బ్రూట్‌ను సార్! కాకపోతే మీ పట్ల నేను ఇంత కృతఘ్నతగా వ్యవహరిస్తానా చెప్పండి? ఇన్నాళ్ళుగా ఈ వూళ్ళో వుంటూ స్టేట్ బ్యాంకులో ఉద్యోగం చేస్తూ... మీరిక్కడున్నారని తెలుసుకోలేక పోవటం నా తప్పు కాదూ? చిన్నప్పుడు మీ యింట్లో వారాలు చేసుకుతిని చదువుకుని... పైకొచ్చిన తరవాత మీ గురించి మర్చి పోవటం తప్పు కాదూ? మొన్న మీరు మార్కెట్లో కూరగాయలు కొంటున్నప్పుడు మిమ్మల్ని చూసి కూడా... అవునా? కాదా? అన్న మీమాంసలో పడి మిమ్మల్ని పలకరించకపోవటం తప్పుకాదూ? మీ అడ్రసు కనుక్కోవటానికి ఇన్నాళ్ళు తీసుకోవటం తప్పు కాదూ? నిగాడు కరక్టు సార్! ఇన్ని తప్పులు చేసిన తప్పుడు వెధవని నేను!!"

"నువ్వటోయ్ ఆనందం? ఎన్నేళ్ళకి చూశాను నిన్ను? అందుకే గుర్తుపట్ట లేక పోయాను. ఇన్నాళ్ళు ఏమై పోయావ్? ఇక్కడే ఉద్యోగం చేస్తున్నావా? చాలా సంతోషం" పున్నయ్య మొహంలో మంద హాసం మెరిసింది. "కూర్చో!" అని అక్కడున్న కుర్చీ చూపించాడు.

కుర్చీలో ఒదిగి కూర్చున్నాడు ఆనంద్. పున్నయ్య గారింటి వారాలు పూర్తయిన తరువాత ... తనెక్కడికి వెళ్ళిందీ ... ఇన్నేళ్ళుగా తనెన్ని అగచాట్లు పడిందీ ఇప్పుడీ ఉద్యోగమెలా వచ్చిందీ... అంతా సవివరంగా మనవి చేశాడు ఆనంద్. ఆనంద్ తల్లిదండ్రులు గతించి పోయారని తెలుసుకుని చాలా విచారించాడు పున్నయ్య. పున్నయ్య భార్య పోయిందని చెప్పినపుడు ఆనంద్ కూడా చాలా బాధ పడ్డాడు. సుందరి బావుందనే చెప్పాడు తప్ప... ఆనంద్ ఎదుటికి పిలిపించలేదు పున్నయ్య. కనీసం సుందరయినా తమ సంభాషణ విని లోపల్నించి బయటికి వస్తుందని ఆశించాడు ఆనంద్. అతని ఆశ నిరాశే అయ్యింది. సుందరికి సంతోషంగ ఉంది. ఆనంద్‌తో మాట్లాడాలని తహతహగానే ఉంది. తానుగా తను వారి ముందుకు వస్తే ... తండేం తిడతాడోనని ... బిక్కు బిక్కు మంటూ లోపలే ఉండి పోయింది--కిటికిలోంచిచూసే దొంగచూపులతోనే సంతృప్తిపడుతూ.

ఓ అరగంట ఆయిన తరువాత పళ్ళ బుట్ట తనే లోపల పెట్టాడు పున్నయ్య! ముసలి పీనుగ! సుందరిని పిలిపించి లోపల పెట్టించ కూడదూ? అనుకున్నాడు ఆనంద్–మనసులో. ఇక లాభం లేదనుకుని నిర్ణయించుకుని... "వస్తాను సార్!" అని శలవు పుచ్చుకున్నాడు. ఏదో మాట వరసకి అన్నట్టుగా "ఎప్పుడయినావస్తుండవోయ్!" అన్నాడు పున్నయ్య. లోలోపలతిట్టుకుంటూ పైకి మాత్రం "అలాగే సార్" అని వెళ్ళిపోయాడు ఆనంద్.

కిటికీలో సుందరి నిరాశగా నిట్టూర్చింది.

* * *

ఓ వారం రోజులు గడిచాయి.

# పులి కూతురు

పున్నయ్య దిన చర్యలో మార్పేమీలేదు. పులిలా గాండ్రిస్తూనే ఉన్నాడు.

సుందరి...తన కన్నెకల లన్నింటినీ బల వంతంగా అణుచుకుంటూ...భయం భయం గానే...ఆకు మాటు పిందెలానే కాలం వెళ్ళ బుచ్చుకుంటోంది.

ఆ రోజు సాయంత్రం ఓ పావుగంటసేపు బజారెళ్ళి రావాలనుకున్నాడు పున్నయ్య. సుందరికి హెచ్చరికలన్నీ చేసి...సంచీ పుచ్చుకుని...బయలుదేరి వెళ్ళిపోయాడు. తను తిరిగి వచ్చేసరికి యింట్లోంచి ఓ మగ కంఠం వినిపించటం విని ఉగ్రుడయి పోయాడు పున్నయ్య. ఈసారి పులిలా గాండ్రించటం కాదు పంజాతో ఆ లేగదూడ గాణ్ణి చచ్చేట్టు కొట్టాలనుకున్నాడు. వడి వడిగ నాలుగడుగులు వేసినవాడు ... సంభాషణ తనమీదే నడవటం విని బ్రేకు వేసినట్టుగా ఆగిపోయాడు! లోపలి వాళ్ళు తనని గమనించే అవకాశం లేదని తెలుసు కున్న పున్నయ్య చెవులు రిక్కించి వినసాగాడు.

"సుందరీ! నీకుసరైన స్వేచ్ఛ నివ్వటం లేదనే బాధ పడుతున్నావుగానీ...మీ నాన్న గారి కేకలు...అరుపుల వెనక ఉన్న అమృత హృదయాన్ని అర్థం చేసుకోలేక పోతున్నావు. నిన్నేదో ఆయన పంజరంలో పెట్టినట్టు బాధ పడతావేమిటి? నువ్వు చిన్నప్పటి నుంచీ తెలిసిన దాని వయినా...నీ మీద నాకెంతో అభిమానమున్నా ... ఈ విష యంలో నీ అభిప్రాయాన్ని నేను సమర్థించ లేను. మీ నాన్నగారికే నా ఓటు పడు తుంది!!"

"ఛీ! మీ మగవాళ్ళంతా ఇంతే! కనీసం నువ్వయినా నన్ను అర్థం చేసుకుం టావనుకున్నాను. అలా కాకుండా స్వజాతి పక్షపాతం పూర్తిగా చూపించుకున్నావు. ఇలాంటి అభిప్రాయమున్నపుడు నువ్వునాకు తెలియకుండా వుంటేనే బాగుండేది. ఈ పంజరం పక్షి బతుకు నాకేమీ బాగోలేదు" తీక్షణంగా అంటోంది సుందరి.

"సుందరీ!" గట్టిగా అరిచాడుఆనంద్. "మీ నాన్నగార్ని తప్పుపట్టే హక్కుగానీ— అర్హత గానీ ఏమీ లేవు నీకు. ఆయన్నే మన్నా నేను సహించను! సహించలేను!! అన్ని వసతులు కలుగజేసి అపురూపంగా తండ్రి నిన్ను చూసుకుంటూ వుంటే ... పంజరం పక్షిలా వుందా తలీ! నీకు బతుకు?!" వ్యంగ్యంగా అంటున్నాడు ఆనంద్.

పున్నయ్య ఉగ్ర నరసింహావతారానికి ప్రహ్లాదుడి స్తోత్రంలా... ఉపశమనం కలి గించాయి ఆనంద్ చల్లని చక్కని పలుకులు! ఆనంద్ ఇంత మంచివాడా? ఇంత ఎదిగిన మనిషా? అనుకుని అతన్ని లోలోపలే అభి నందించుకున్నాడు పున్నయ్య!

"అవును! అక్షరాలా నాది పంజరంలో పక్షిలాంటి బతుకు, ఇలాంటి జీవితం నాకు అక్కరలేదు" ఆవేశంగా అంటోంది సుందరి.

"అమ్మపిల్లా! ఎలాంటి భావాలున్నయ్ దీని మనసులో? దీనికేం కష్టం కలిగిం చానని ఇలా ఇద పోతుంది?" సుందరిమీద కోపంతో పళ్ళు పట పట నూరాడు పున్నయ్య

ఆనంద్ కూడా గట్టిగానే జవాబిచ్చాడు సుందరికి. "అయితే ఏమంటావు నువ్వు? తేల్చి చెప్పు? ఎవరితోనన్నా లేచిపోతావా?"

"నా యిష్టం! నువ్వెవరివి? నన్ను శాసించటానికి! మా యింట్లో వారాలు తిని చదువుకున్న వాడివి, నువ్వు కూడా నాకు చెప్పేటంత పెద్దవాడి వయ్యావా? ఇక నుంచీ ఎప్పుడూ నా దగ్గరికి రావటానికి... మాట్లాడటానికి ప్రయత్నించకు. భంగ పడతావ్!" నాగినిలా బుసలుకొడ్తోంది సుందరి.

"సుందరీ! నీ మీద అభిమానం కొద్దీ ఊరుకుంటున్నాను గదాని నోటికొచ్చినట్టు పేలకు! నేను మీ నాన్నగారి ఉప్పు పులుసు తిన్నాను కొన్నాళ్ళు. ఆ విశ్వాసం నా నర నరాల్లో జీర్ణించుకుపోయి ఉంది నువ్వెక్క డున్నావో తెలయక ముందు నీ సంగతి నాకు పట్టలేదు తీరా తెలిసి— కళ్ళారా చూస్తూ ఊరుకోలేను. నా కంఠంలో ప్రాణముండగా నువ్వు మీ నాన్నగార్కి ద్రోహం చెయ్యలేవు! ఖబడ్దార్! ఇవాల్టినుంచి నీ ప్రతి కదలికా రోజూ ఉదయం సాయంత్రం కనిపెడుతూనే ఉంటాను. నా రాక మీ నాన్నగారి కిష్టం లేకపోయినా వస్తూనే ఉంటాను— నువ్వేద యినా పిచ్చి వేషాలేశావో... నీ కాళ్ళు చేతులు కట్టి తీసుకొచ్చి మీ నాన్నగారి కాళ్ళమీద పడేస్తాను జాగ్రత్త."

(36వ పేజీ చూడండి)

(గత సంచిక తరువాయి)

























[ఇంకా వుంది]



'కళ్యాణ చక్రవర్తి'లో కృష్ణంరాజు

***



'గోరింటాకు'లో సుజాత

# సినిమా విశేషాలు -జి. వి. జి.

## "ఎవడబ్బ సొమ్ము"లో హీరో దానధర్మాలు చేసే సొమ్ము

హీరో కృష్ణ ఆఫీసు గదిలోకి రాగానే సెక్రెటరీ విష్ చేస్తూ, అతను శరణాలయంలో పిల్లల కోసం కట్టించాలనుకున్న కొత్త బిల్డింగ్ ప్లాన్ ఎస్టిమేట్ సిద్ధంగా ఉందంటూ, "వీళ్ళంతా మీ కోసం చాలాసేపట్నించి ఎదురుచూస్తున్నారు, సార్!" అంది కొద్ది దూరంలో బారుబుతీర్చి నిలబడి ఉన్న వారివంక చూపిస్తూ. వారిలో ఒకరు "మా పేటలో లైబ్రరీ పెట్టించాలనుకుంటున్నాం, సార్!" అని, మరొకరు "మేం గుడి చందా కోసం వచ్చాం, బాబుగారూ!" అని, ఒక మహిళ "స్త్రీ సేవాసదనం నడుపుతున్నాం, సార్! కుట్టుమిషన్‌లూ అవీ కొనడానికి ఫండ్స్ కావాలి, సార్!" అని, ఒక వృద్ధుడు "బాబూ! నేనేం గతి లేనోడ్ని. నా కొక్కతే ఆడపిల్ల. దానికి పెళ్ళి జెయ్యాల!" అని వేడుకున్నారు "సరే-సరే... మిస్ మేరీ! వీళ్ళందరికీ ఏ పనికి ఎంత అవసరమో లెక్క చూసి లిస్ట్ తయారు చెయ్ ఆ ప్రకారం ఇచ్చేద్దాం," అంటూ కృష్ణ వెనుతిరిగి తన గదిలోకి వెళ్ళగానే రాజా అనే ఒక వ్యక్తి "నమస్తే!" అన్నాడు

"నమస్తే... ఎవరు మీరు? ఎందుకొచ్చారు?" కృష్ణ అడిగాడు

"నల్లతాచు నాగూ మీకు తెలుసా?"

"తెలుసు. వాడు చాలా దుర్మార్గుడు."

"వాడు మాకో డైమండ్ అమ్మాడు. డబ్బు మొత్తం ఇచ్చేశాం వాడిచ్చిన డైమండ్ ఇదిగో," అంటూ పగిలిన రెండు గాజు ముక్కలను చూపించాడు రాజా.

"నకిలీదిచ్చాడన్న మాట?"

"అవును, సార్! ఆ ఒరిజినల్‌ను వాడి దగ్గర్నించి మీరుతప్ప ఎవరూ ఇప్పించలేరు. మీరది ఇప్పిస్తే, మీ పేమెంట్ ఇరవై వేలు. అడ్వాన్స్ ఇవ్వమంటారా?"

"అవసరంలేదు. రేపు మొత్తం డబ్బిచ్చి డైమండ్ తీసుకెళ్ళు"

"థాంక్స్, సార్. వస్తాను"

"హుఁ! నల్లత్రాచు!" అంటూ కృష్ణ ఆవేశంతో పిడికిలి బిగించాడు

కె ఎస్. ఆర్ దాస్ దర్శకత్వంలో అలపర్తి సురేంద్రనాథ్, వాసిరెడ్డి నాగేశ్వరరావు నిర్మించే సురేంద్రా ఆర్ట్ పిక్చర్స్ "ఎవడబ్బ సొమ్ము" వర్ణ చిత్రానికి మహారథి రచయిత జె వి. రాఘవులు సంగీత దర్శకుడు

గణ దేవత [బెంగాలీ చిత్రం] లో ఉత్తమ బాల నటుడుగా ఎన్నికైన కాంచన్ బిశ్వాస్‌కు అవార్డు నందిస్తున్న రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి



'కెప్టెన్ కృష్ణ'లో



## గంధర్వ కన్యలో దయ్యంగా మారిన కన్య

అలసి సొలసి అడవిలో ఠక్కులు చూస్తూ ఎటో పోతూన్న వసంతుని ఎదుట ఓ ముసలి దయ్యం హఠాత్తుగా ప్రత్యక్షమైంది. "అటెక్కడికిరా పోతావ్? అటుపక్క రకరకాల దయ్యాలున్నాయ్!" అంది. వసంతుడు లోలోన భయపడ్డా — పైకి మాత్రం "ఏదీ? ఎక్కడా దయ్యం? దాని కాళ్ళు విరిచేస్తా. కళ్ళు పీకేస్తా. తాట వలిచేస్తా," అన్నాడు. "అయితే, నీకు దయ్యాలంటే..." అని ముసలి దయ్యం తెల్లబోగా "ఒక్కో దయ్యం వెంట్రుకతో సమానం ... మా తండ్రి ఓ దయ్యాన్ని పెళ్ళి చేసుకొని వదిలేశాడు. మా తాత ఓ దయ్యానికి కడుపుచేసి వదలిపెట్టాడు. అలాంటి వంశంలో పుట్టిన మగవాడ్ని — మొనగాడ్ని నేను దయ్యాలకు భయపడ్డమా? నిజం చెప్పాలంటే నేను దయ్యాలకే మొగుడ్ని," అన్నాడు వసంతుడు "అయితే, నీలాటివాడే కావాలిరా మా పాపకు," అంది ముసలి దయ్యం "అమ్మబాబోయ్! నువ్వే పీపాలా వున్నావ్ ఇక నీ పాప." వసంతుడు అసహ్యించుకుంటూ మెలికలు తిరిగిపోయేసరికి "అందాల చిలకరా వద్దంటావేరా మొద్దా! అది ముద్దులగుమ్మ. అపరంజి బొమ్మ మురిపాలరెమ్మ," అంది ముసలి దయ్యం "అమ్మమ్మా! ఇక చాలు ఆకలితో నేను అల్లలాడుతుంటే నువ్వు పెళ్ళో అంటావేంటి?" ఏడుపుముఖం పెట్టాడు వసంతుడు "అయితే పెళ్ళి భోజనమే చేద్దాం రా .." అంటూ అతన్ని తీసుకొని వెళ్ళింది ముసలి దయ్యం అల్లంతలో పిల్లదయ్యం పక్కని కన్యలా ఊయలలూగుతూండడం చూపించి, "అదిగో నా చిట్టితల్లి ఉల్లాసంగా ఉయ్యాలలూగుతోంది," అంటూ తల్లిదయ్యం తప్పుకుంది వసంతుడు మురిసిపోతూ, ఆ కన్య దగ్గరికి వెళ్ళి, 'నీపక్కన కూర్చోవచ్చా?" అన్నాడు. "నేనొద్దన్నానా?" వాయ్యారంగా కనురెప్పలార్పింది కన్య. "అబ్బ! ఎంత ముద్దుగా మాట్లాడుతున్నావ్!" అంటూ వసంతుడు ఉయ్యాలపై కూర్చొని, ఆమె తలలోని పూల వాసన చూస్తూ, "ఆహా! ఏం సువాసన! నా సుందరీ, నీ తలే మల్లెపందిరి!" అన్నాడు అతని చేతిని వాసన చూసిన ఆ పిల్ల "అమ్మోయ్! ఇతని చెయ్యి చెరుకురసం వాసనేస్తోందే!" అని కొట్టలువేసింది "ఛా! పో! స్నానంలేక ఒళ్ళంతా చెమట కంపు కొట్టి నేనేడుస్తుంటే— చెరుకురసం వాసనేస్తోందట — చెరుకురసం వాసన!" అన్నాడు వసంతుడు "నీ కంపే నాకింపు. నిజంగా నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అందా పిల్ల క్రీగంట చూస్తూ "నీ తల్లితోడు!" అంటూ ఆ పిల్ల తలమీద అలా చెయ్యి వేశాడో లేదో అమాంతంగా ఆ పిల్ల దయ్యంగా మారిపోయింది. వసంతుడు గాభరాతో ఉయ్యాల చుట్టూ తిరగసాగాడు ఇంతలో తల్లి దయ్యం కూడా ఊడిపడింది. ఇద్దరూ వసంతుడ్ని వెంబడించసాగారు

విరగబడి నవ్వుతూ దర్శక నిర్మాత విరల ఆచార్య "కట్!" అనేసరికి సారథి, కల్పనారాయ్, కొత్త నటి శివకుమారి రొప్పుతూ రొజుతూ ఊయల చుట్టూ తిరుగుతూన్నవారల్లా ఆగి, గొల్లున నవ్వసాగారు. "ఈ దయ్యాల బారి నుంచి వసంతుడు తమాషా చేసి తప్పించుకుంటాడు," అని తదుపరి సంఘటనను నాకు వివరించారు విరలాచార్య ప్రభ, నరసింహరాజు, జయమాలిని ముఖ్య భూమికలు నిర్వహించే విరల్ ప్రొడక్షన్స్ రంగుల చిత్రం "గంధర్వకన్య" విడుదలకు సిద్ధమవుతోంది.



కృష్ణ, నాగభూషణం



'ముత్తయిదువ'లో జయచిత్ర

## శ్రీరామబంటు

రవి చిత్ర ఫిలిమ్స్ అధినేత వై. వి. రావ్ నిర్మించే "శ్రీ రామ బంటు" వర్ణ చిత్రంలో చిరంజీవి, మోహన్‌బాబు, రాజ్‌బాబు, హరిప్రసాద్, కె. కె శర్మ, ముక్కామల, అర్జా జనార్దనరావు, మిక్కిలినేని, శ్రీలంక మనోహర్, పెమ్మసాని రామకృష్ణ, గీత, సత్యకళ, అనిత, కల్పనారాయ్, అత్తిలి లక్ష్మి పాత్రధారులు. గొల్లపూడి సంభాషణకర్త. సత్యం స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. పి విజయకుమార్ ఛాయాగ్రాహకుడు. కూర్పును డి. రాజగోపాల్, సహకార దర్శకత్వాన్ని ఎం. నందకుమార్, తరణిరావ్ నిర్వహిస్తున్నారు. మే 10 నుంచి జూన్ 15 వరకు పుత్తూరు, కార్వేటినగర్, సురేంద్రనగర్ పరిసరాలలో ఏకబిగిన సాగే షూటింగ్‌తో చిత్రం పూర్తవుతుంది ఐ. ఎన్. మూర్తి దర్శకుడు

## శుభమహోత్సవాలు

మే 3 న జయప్రద నూతన గృహప్రవేశం, మే 5 న దాసరి నారాయణరావు జన్మదినోత్సవం నాడు పాత్రికేయులు శుభాకాంక్షలు అందజేశారు అదేరోజు డైరెక్టర్ శ్రీధర్ విదేశాలకు పయనమయ్యే సందర్భంలో భరణీ చిత్ర వారు పాత్రికేయుల సమావేశం ఏర్పాటు చేశారు. శ్రీ ఎన్ టి ఆర్ తృతీయ పుత్రిక చి॥ సౌ॥ పురంద్రీశ్వరికి చి॥ డాక్టర్ వెంకటేశ్వరరావుతోను, పుత్రుడు చి॥ మోహనకృష్ణకు దర్శక నిర్మాత శ్రీ ఉప్పలపాటి విశ్వేశ్వరరావు ద్వితీయ పుత్రిక చి॥ శాంతి తోనూ మే 9 న మద్రాసు 'అబాట్స్‌బరీ'లో వైభవోపేతంగా కల్యాణ మహోత్సవాలు జరిగాయి కళాసాగర్‌వారు మే 5 న 1978 లో ఉత్తమ నటిగా మూడవసారి ఎన్నికైన శారదను ఘనంగా సన్మానించారు హాస్య నటుడు ధమ్ చి॥ సౌ॥ లలితను మే 9 న గుంటూరులో పరిణయమాడారు

'జబర్‌దస్త్'లో శారద, దిలీప్ కుమార్





'తూర్పు వెళ్లే రైలు'లో జ్యోతి



'పట్నం పిల్ల'లో శ్రీదేవి

## కొత్త చిత్రాలు

"ప్రేములు–పెళ్ళిళ్ళు, ఈకాలపు పిల్లలు" చిత్రాల అనంతరం దగ్గుబాటి భాస్కరరావు జూలై నుంచి ప్రారంభించే అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ వారి వర్ణ చిత్రానికి కట్టా సుబ్బారావు దర్శకుడు నటుడు బాలయ్య రాసిన కథకు గుహనాథన్ చిత్రానువాదాన్ని, సత్యానంద్ సంభాషణలను రాస్తున్నారు సత్యం సంగీత దర్శకుడు. రామకృష్ణారావు ఛాయాగ్రాహకుడు



# సినిమా

"మండే గుండెలు" అనంతరం సురేష్ అధినేత డి. రామానాయుడు ఆగస్టులో ప్రారంభించే చిత్రంలో కృష్ణంరాజు హీరో. సులోచనారాణి విరచిత "అగ్నిపూలు" నవలకు కె. బాపయ్య దర్శకుడు.

జూన్ 24న దేవర్ ఫిలిమ్స్ ప్రారంభించే కొత్త చిత్రంలో మురళీమోహన్, మోహన్‌బాబు, నరసింహరాజు, కె. ఆర్. విజయ, శ్రీప్రియ, జయలక్ష్మి, రజనీకాంత్ ప్రభృతులు పాల్గొంటారు. దండాయుధపాణి నిర్మాత. ఆర్. త్యాగరాజన్ దర్శకుడు.

ఛాయాగ్రాహకుడు లక్ష్మణ్‌గోరే స్వయంగా దర్శకత్వం వహిస్తూ హైదరాబాద్‌లో నిర్మించే "రిక్షావాలా జిందాబాద్" ప్రయోగాత్మక చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, సంగీతం, కూర్పు కె. హనుమాన్‌ప్రసాద్ నిర్వహిస్తారు జి. ఎస్. ఆర్. మూర్తి ముఖ్య పాత్రధారి.

చెరుకూరి జనార్దనరావు సమర్పణలో ఆర్. ఎస్. రామరాజు నిర్మించే సౌమ్య సినీ ఆర్ట్స్ "జాతర" వర్ణ చిత్రానికి మే 3న ప్రసాద్ స్టూడియోలో పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. జి. కె. వెంకటేష్ సంగీత దర్శకుడు. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం ధవళ సత్యం, బి. ఎస్‌సి.

మద్రాసు ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో డిప్లొమా పొందిన బాబు దర్శకత్వంలో ఉదయభాస్కర్, సైదారెడ్డి "శాంతినివాస్" అనే వినోదాత్మక చిత్రాన్ని శ్రీ లక్ష్మి సినీ చిత్ర పతాకంలో నిర్మిస్తున్నారు. ఆత్రేయ కెమెరా స్విచ్ ఆన్, ఆట్లూరి హనుమంతరావు తొలి క్లాప్‌తో చిత్రీకరణ ప్రారంభమైంది. జయంతి, నాగభూషణం, నరసింహరాజు, చిరంజీవి, ప్రసాద్‌బాబు, హరిప్రసాద్, చిట్టిబాబు, మాధవి, ప్రతిమ, ప్రసిద్ధ తమిళ తారలు ఎం. ఆర్. ఆర్. వాసు, మనోరమ పాల్గొంటున్నారు. జయశ్రీ రామారావు కథకుడు. చక్రవర్తి సహాయకుడు. చంద్రశేఖర్ సంగీత దర్శకుడు. ఇందు ఛాయాగ్రాహకుడు.

## తెలుగు చిత్రాల హిందీ పరివర్తనం

దాసరి దర్శకత్వంలో హిందీ హీరో జితేంద్ర "కటకటాల రుద్రయ్య"ను హిందీలో నిర్మిస్తున్న విషయం పాఠకులకు విదితమే "రంగూన్ రౌడి" చిత్రాన్ని విజయమాధవీవారే హిందీలో దాసరి దర్శకత్వంలో రూపొందిస్తారు. ధర్మేంద్ర, హేమమాలిని, జితేంద్ర, బిందియాగోస్వామి ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. డి రామానాయుడు "చిలిపి కృష్ణుడు" చిత్రాన్ని హిందీలో కె. బాపయ్య దర్శకత్వంలో నిర్మిస్తారు. రాజేష్‌ఖన్నా, హేమమాలిని, డానీ ప్రధాన పాత్రధారులు. షూటింగ్ జూలైలో ప్రారంభమై, డిసెంబర్‌కు పూర్తవుతుంది. "తాయారమ్మ–బంగారయ్య" చిత్రాన్ని బి. నాగిరెడ్డి హిందీలో సమర్పిస్తారు "యమగోల" హిందీ చిత్రం అనంతరం "పుట్టినిల్లు–మెట్టినిల్లు" చిత్రాన్ని శ్రీ పల్లవి ప్రొడక్షన్స్ పతాకంలో ఎస్ వెంకటరత్నం నిర్మిస్తారు జయప్రద, జితేంద్ర నాయికా నాయకులు. లక్ష్మీకాంత్ ప్యారేలాల్ సంగీత దర్శకులు. తాతినేని రామారావు దర్శకుడు పద్మాలయావారి "దేవుడు చేసిన మనుషులు" చిత్రాన్ని జి. ఆదిశేషగిరిరావు హిందీలో బాపయ్య దర్శకత్వంలో తయారుచేస్తారు జితేంద్ర (కృష్ణ), సంజీవ్‌కుమార్ (ఎన్. టి ఆర్.), అశోక్‌కుమార్ (ఎస్ వి.ఆర్.), జీనత్ అమన్ (జయలలిత), జయప్రద (విజయనిర్మల), బిందియాగోస్వామి (కాంచన), వినోద్ మెహ్రా (జగ్గయ్య), రంజిత్ (కాంతారావు) పాత్రలను నిర్వహిస్తారు చరణ్ దాస్ షోక్ రచయిత. ఆనంద్ బక్షీ గీతాలకు ఆర్. డి. బర్మన్ స్వరకల్పన చేస్తారు

'ఐ లవ్ యూ'లో సువర్ణ



'ఛాయ'లో సత్యేంద్రకుమార్



### అన్నపూర్ణా స్టూడియోలో
### ఎ ఎన్ ఆర్ కంబైన్స్ చిత్రాలు

దాసరి దర్శకత్వంలో శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించే "కల్యాణి" చిత్రానికి వెంకట్ అక్కినేని నిర్మాత. మురళీమోహన్, జయసుధ, ప్రభాకరరెడ్డి, మోహన్‌బాబు, ధూళిపాళ, రమాప్రభ, నిర్మల పాత్రధారులు. మాదిరెడ్డి సులోచన నవల "రాగమయి" మాతృక. రమేష్‌నాయుడు సంగీత దర్శకుడు. ఆ తర్వాత దాసరి దర్శకత్వం నెరపే "కీర్తికిరీటాలు" చిత్రంలో ఎ ఎన్ ఆర్.. జయసుధ నాయికా నాయికలు.

ఏప్రిల్ 25న అన్నపూర్ణా స్టూడియోలో నాలుగవ ఫ్లోర్‌కు సుప్రసిద్ధ హిందీ నటుడు అశోక్‌కుమార్ ప్రారంభోత్సవం చేశారు.

### రచయిత పేరు లేకుండా టైటిల్స్

"దాదా" హిందీ చిత్రానికి స్క్రీన్‌ప్లే, డైలాగులు రాసిన తేజ్‌నార్‌జార్ పేరును పొరబాటున వదిలేసి టైటిల్స్ షూట్ చేశారు. బొంబాయిలో ఆ చిత్రం విడుదలయ్యాక ఆ పొరబాటు గుర్తింపబడింది. వెంటనే నిర్మాతలు ఆ రచయిత కార్డును షూట్ చేసి, అన్ని థియేటర్లకూ పంపించి, టైటిల్స్‌లో జోడించారు.

## మధ్యవర్తిని "మనువాడి"న 'మగువ'

రాజస్థాన్ రాష్ట్రంలో పాలీ జిల్లాలో పోలే అనే గ్రామంలో ఒక విచిత్రం జరిగింది. ఆ వూరి పెద్దమనిషి ఒకడు కూతురు పెళ్ళి చెయ్యాలనుకుని యేర్పాట్లు చేసుకున్నాడు. కాని పెళ్లికి యిద్దరు పెళ్లికొడుకులు మందీ మార్బలంతో తరలివచ్చారు. పెళ్లికూతురు తండ్రి యెవరికి 'కన్యాదానం' చెయ్యాలో తెలియక తికమకపడి ఆ వూళ్లోనే బాగా పెద్దమనిషిగా చెలామణీ అవుతున్న, అయిన ఒక మగధీరుణ్ణి తగాదా తీర్చమని పిలిచాడు. భార్య, ఎనిమిదిమంది సంతానం వున్న ఆ "మధ్యవర్తి" రంగంలోకి దిగి, పరిస్థితులను పరిశీలించి, మరో కొత్త సమస్య తీసుకొచ్చాడు. పిట్టపోరూ పిట్టపోరూ, పిల్లి తీర్చింది అన్నట్టు "మీ అమ్మాయిని యీ యిద్దరికీ యివ్వొద్దు. నేనే పెళ్లి చేసుకుంటాను పద పీటలమీదికి" అన్నాడు. పెళ్లికూతురు తండ్రి కూడా పై వూరు "యువకులు" కన్నా వున్న వూరు పెద్దమనిషి అనుభవజ్ఞుడైన ముసలి వరుడే తగినవాడని — యీ పెద్దమనిషికే పిల్లనిస్తానని తతిమ్మా యిద్దర్నీ పొమ్మన్నాడుట! "న్యాయమూర్తిగా పిలిచాం కనుక అతని తీర్పుకే మనం" కట్టుబడివుండాలి అని చెప్పి తన పిల్లనిచ్చి యీ ఎనిమిదిమంది పిల్లల తండ్రికి పెళ్లి అదే ముహూర్తాన చేశాడు. చేసేది లేక, మధ్యవర్తి భార్య కూడా పెళ్లి పందిట్లోకి వచ్చి, వేడుకలో పాలుపంచుకుందిట!

### నీడ

దాసరి నారాయణరావు దర్శకత్వంలో రామినేని నిర్మించే తెలుగు చిత్ర వారి "నీడ" ప్రయోగాత్మక చిత్రం. ఈ చిత్రంలో పాటలు లేకపోవడం, సంభాషణలు తక్కువగా వుండడం ఓ విశేషం. అపసవ్యమైన జీవితంలో సుఖశాంతులకోసం అడ్డదారులు తొక్కే మధ్యతరగతి పెద్దల అలవాట్లకు వారి పిల్లలు ఏవిధంగా ఆకర్షితులవుతారో, దానివల్ల వారి బంగారంవంటి భవిష్యత్తు ఏవిధంగా వక్రిస్తుందో తెలియజేస్తుందీ చిత్రం.

### గోరింటాకు

దాసరి నారాయణరావు దర్శకత్వంలో యువచిత్ర వారి ద్వితీయ చిత్రానికి పై పేరు పెట్టినట్లు నిర్మాత కె మురారి తెలియజేశారు. విశాఖపట్నం, రాజమండ్రి, రంపచోడవరం, మారేడుమిల్లి, ఆగిరపువలస, తాళ్ళవలస వగైరా ప్రాంతాలలో శోభన్‌బాబు, సుజాత, వక్కలంక పద్మ, చలం ప్రభృతులపై కొన్ని కీలక సన్నివేశాలు చిత్రీకరించబడ్డాయి. సమర్పణ కె. నరసింహ నాయుడు.

'విమజ్జనం'లో బోసుబాబు, శారద



# కళారంజితమైన గోకుల్

భరత నాట్యంవలే అపూర్వమైన పౌడర్ గోకుల్. దక్షిణ దేశపు కళలవలే కళారంజితమైనది. మెత్తటి చందనమునకు, శ్రేష్ఠమైన మూలికలు చేకూర్చబడినవి.

గోకుల్ సాన్‌డల్‌వుడ్ పౌడరు వేసవి కాల ఉష్ణము నుండి మీ శరీరము నల్లబడకుండా కాపాడును. గోకుల్ సాన్‌టాల్ రోజంతా చందన సువాసనలో మిమ్ము హాయిగా వుంచుతుంది.

గోకుల్ పౌడర్ ఉపయోగించండి.
వసంతకాల పువ్వులా తాజాగా వుండండి.



## గోకుల్

సాన్‌టాల్ &
సాన్‌డల్ వుడ్
పౌడరు

టి. యస్. ఆర్. & కంపెని.,
మదరాసు 600 089.



మా అమ్మ తన సింగర్ సూయింగ్ మెషీన్‌పైనే
మా బట్టలన్నీ కుట్టి ఎంతో పొదుపుచేసింది.
మా పిల్లలు పెరుగుతున్నారు గనక
ఇప్పుడు నేనూ సింగర్ వారి మెరిట్ ద్వారా
పొదుపు చేస్తున్నాను.



సీరియల్

# ఇది ఒక పాంథశాల

శ్యామల

(గత సంచిక తరువాయి)

## 6

**విజయ్** వెళ్ళవలసిన రోజు వచ్చింది.

ఆ సాయంత్రం స్నేహితులంతా వీడ్కోలు విందు యిచ్చారు. పూలమాల చేతిమీద వేసుకొని టాక్సీ దిగి మిత్రులకు గుడ్‌బై చెప్పి ఇంట్లోకి వస్తుంటే చూస్తూ గుమ్మంలో నిల్చుంది సంధ్య.

ఆ రాత్రి రైల్లో బయల్దేరి బెంగుళూరు వెళ్తున్నాడు విజయ్. అక్కడి ఎయిర్‌ఫోర్స్ టెక్నికల్ కాలేజిలో ఏడాదికి పైగా ట్రైనింగ్ తీసుకోవలసి వుంది

పాలరాతి బొమ్మలా నిల్చున్న సంధ్యను చూస్తూ, "నువ్విలా విషాదంగా పోజ్ పెడ్తే నేనెలా వెళ్ళగలనోయ్? ట్రైనింగ్ పీరియడ్‌లో ఫామిలీతో వుండటానికి ఒప్పుకోరు. కనక తప్పటంలేదు ఈ సెపరేషను! లేకపోతే నిన్ను వదిలి వెళ్ళగలనా సంధ్యా? నీకు మాత్రం తెలియదా? ఒక్క సంవత్సరం ఎలాగో గడిపామంటే ఆపైన మళ్ళీ ఇద్దరం ఒక్కచోటే వుంటాం. వీలయినపుడల్లా వచ్చి చూస్తూ వుంటానుగా...నవ్వుతూ నన్ను పంపించా మరి... ప్లీజ్! ఒక్క స్మైల్. ఊఁ..."

సంధ్య కళ్ళు రెండూ నీళ్ళతో నిండివున్నాయి పెదవుల పైన చిన్నగా నవ్వు విరిసింది "ఇంద్రధనస్సులా వున్నావు" దగ్గరగా తీసుకున్నాడు

గాలికి రెపరెపలాడుతున్న చిగురాకును గుర్తుకుతెస్తున్నది తన చేతుల్లోని సంధ్య. చిన్నగా తల వంచి ఆమె పెదవులతో తన పెదవులు కలిపాడు. మండుతున్నట్లు వేడిగా వున్నాయి ఆ పెదవులు. ఆ స్పర్శ అతనికి ఏదో విచిత్రమైన అనుభూతి నిచ్చింది. అది మధురిమ కాదు ... తనను సెగలు చుట్టుముడుతున్నట్లు వేడి ... తిరిగి ఎన్నాళ్ళకో ఈ కలయిక అని మనసు, నరాలు పరితపిస్తుంటే తమను ఒకటి చేస్తున్న జ్వాల. ప్రేమజ్వాల. అట్లాగే తేలికగా రెండు చేతులతో ఎత్తి ఆమెను మంచంపైన పడుకోబెట్టాడు

శంఖం చెవి వద్ద పెట్టుకుంటే వినవచ్చే హోరు ఆమె చెవుల్లో...ఆ రొదలో ఏమవుతున్నదీ అర్థంకాలేదు కాలగమనాన్నే ఆపివేయగల ఆ అనుభూతే ప్రపంచాన్ని ముందుకు నడుపుతున్న అంతర్లీనమైన శక్తి

*   *   *

"సంధ్యా!

ఎలావున్నావు? మన బంగారు తల్లి/తండ్రి నిన్ను ఇబ్బందిపెట్టటంలేదుకదా! ప్రతి వారం డాక్టరు వద్దకు వెళ్తున్నావా? ఆరోగ్యంమాత్రం అజాగ్రత్త చేయకు సుమా!

ఇక్కడ చలి ఎక్కువగా వుంది. ప్రొద్దున్నే అయిదుగంటలకు లేచి ఎక్సర్‌సైజుకి వెళ్ళాలంటే ఎంత విసుగనిపిస్తుందో ఎలా చెప్పను? అసలు లేవబుద్ధేకాదు. అలా బ్లాంకెట్ క్రింద పడుకొనే వుండాలనిపిస్తుంది. ప్రక్కన నీవు లేని లోటు ఎంతగా అనిపిస్తుందో! అదుగో, కోపంగా చూస్తున్నావు! సారీ. ప్రొద్దున్నేకాదు, ఎప్పుడూ కూడా నువ్వు లేని లోటు తెలుస్తుందోయ్.. నిజం!

డ్రిల్, ఎక్సర్‌సైజ్ అయినాక స్నానం, బ్రేక్‌ఫాస్ట్‌ల తర్వాత క్లాసులు. ఎయిర్ ప్లేను మెకానిజం, టెలీ కమ్యూనికేషన్లు లాంటి క్లాసులు జరుగుతాయి కొన్ని థియరీ క్లాసులు, కొన్ని ప్రాక్టికల్ క్లాసులు

ఇక సాయంత్రాలు పూర్తిగా మావే బార్లు, సినిమాలు, రేసులు, షికార్లు రకరకాల చోట్లకి తిరుగుతారు అందరూ. నిజం చెప్తున్నా సంధ్యా, నాకు ఎక్కడికీ వెళ్ళాలనిపించదు! నీతో కలిసి వెళ్ళటం అలవాటయ్యాక ఒంటరిగా వెళ్ళటంలో ఏమీ ఆనందం కనబడదు ఏదో పుస్తకం చదువుకుంటూ కాలం గడుపుతాను. ఒక్కోసారి అలా ఊరి బయటకు వాకింగ్‌కి వెళ్తే ఆలోచనల్లో మైళ్ళకొద్దీ నడుస్తాను రాత్రికి అలసిపోయి నిద్రపోయి కలల్లో నా రాణి దర్శనం చేసుకుంటాను. ఈ మధ్యనో పుస్తకం చదివాను రాణీ! మనుష్యులు దూరమయినపుడు మనసులు మరింత దగ్గరవుతాయన్నాడు ఆ రచయిత నిజమంటావా?

వెంటనే జవాబు రాస్తావుగా! ఎదురుచూస్తూ—

నీ, విజయ్."

**జరిగిన కథ - 5**. అక్క నిర్మల, బావ రవిల సంరక్షణలో ఉంటున్న సంధ్యకు 'అట్టావా'లో ఉద్యోగం రాగా విజయ్‌కి తనకు జరిగిన వివాహ పూర్వాపరాలు గుర్తుకువస్తాయి. నిర్మలను చూడటానికి వచ్చినపుడే మనసులు కలిసి రిజిష్టరు మేరేజి చేసుకున్న విజయ్, సంధ్యల జీవితం సాఫీగా సాగుతుండగా, విజయ్ మిలటరీలో ఉద్యోగానికి లోగడే దరఖాస్తు చేసాడని తెలుసుకొని విస్తుపోతుంది సంధ్య. విజయ్ స్నేహితుడు రవితో నిర్మలకు పరిచయమౌతుంది. విజయ్‌కి ఎయిర్‌ఫోర్స్‌లో ఇంటర్వ్యూకి వెళ్ళి తిరిగివచ్చిన తరువాత, జాబ్ వస్తే జేరటానికి సంధ్య తన సంతోషాన్ని వ్యక్తపరుస్తుంది

ఉత్తరాలు నడుస్తూనేవున్నాయి. రోజులు దొర్లిపోతున్నాయి. విజయ్‌కి ట్రైనింగ్‌లో రెండవ భాగం మొదలయింది. దీనిని సిమ్యులేటర్ ట్రైనింగ్ అంటారు. అంటే ఆగివున్న ఒక విమానంలో కూర్చుని, అది పోతున్న విమానంగా ఊహించుకొని, దానిలో పని చేయాలి. విజయ్ ఫీల్డ్ టెలీ కమ్యూనికేషన్సు పైలట్ కాకపోయినా అవసరమైతే ప్లేనును పైలట్ చేయగలిగి వుండాలనే ఉద్దేశ్యంతో అతని ట్రైనింగ్‌లో ఫ్లైయింగ్ కూడా వుంది ఎయిర్ ప్లేను మెషనరీ మెయిన్‌టెనెన్స్, కమ్యూనికేషను లింక్స్ మొదలైనవి స్టడీ చేయటం, నేర్చుకోవటం చాలా ఉత్సాహంగా వుంది

ఉగాది పండుగ సమయంలో వారం శలవు తీసుకొని హైదరాబాదు వచ్చాడు. శలవు దొరుకుతుందో లేదోననే అనుమానంతో ముందుగా సంధ్యకి తెలియచేయలేదు.

రైలు దిగుతూనే ఆటోలో సంధ్య పుట్టింటికి వెళ్ళాడు. ఇల్లంతా హడావిడిగా వుంది. వాకిట్లో టాక్సీ ఆగి వుంది. ముందు గదిలో నిర్మల బాగ్‌లో ఏవో సామాన్లు సర్దుతున్నది. వాళ్ళ నాన్నగారు, అమ్మగారు నిలబడి ఏదో సీరియస్‌గా మాట్లాడుతున్నారు. రవి కూడా అక్కడే వున్నాడు.

సంధ్య జాడలేదు

సూట్‌కేస్ చేతిలో పెట్టుకొని అడుగుపెట్టిన విజయ్‌ని ఎవరూ గమనించలేదు ఓ నిమిషం సడన్‌గా తలెత్తిన నిర్మల ఆశ్చర్యంగా "విజయ్!" అంది.

అందరూ విస్మయంగా చూశారు అతన్ని వాళ్ళందరి ముఖాల్లోనూ ఏదో రిలీఫ్ కనిపించింది అంతలోనే

"సంధ్య—?" అన్నాడు విజయ్

"లోపల వుంది" అన్నారు సంధ్య నాన్నగారు

"రాత్రి నుంచి కొద్దిగా నొప్పులు మొదలయినాయి హాస్పిటల్‌కి వెళ్దామంటే విజయ్‌కి కబురు చేయండి. అతను వచ్చాకనే వెళ్దాం అని మొండిగా అంటున్నది. నీకు టెలిగ్రాం ఇచ్చాం ఇందాకనే లేడి డాక్టరుని ఇంటికి పిలుచుకువచ్చి చూపిస్తే 'ఈ రాత్రికి డెలివరీ అవవచ్చును. హాస్పిటల్‌లో చేర్పిస్తే మంచిది' అన్నది ఇటు సంధ్యకి నచ్చచెప్పలేక నిమిషాలమీద నిన్ను ఎట్లా తీసుకురావాలో తెలియక బాధపడుతున్నాం"

"దేవుడు పంపినట్లే వచ్చావు నాయనా." కళ్ళు తుడుచుకుంటూ అంది వాళ్ళ అమ్మ.

భార్యకు డెలివరీ టైమ్ ఆసన్నమయినదంటే విజయ్‌కి భయమనిపించింది తమాయించుకుంటూ లోనికి వెళ్ళాడు

తెల్లని దుప్పటి కప్పిన మంచంపైన పడుకునివుంది సంధ్య. కళ్ళు మూసుకొనివుంది దిండుమీద పడివున్న నల్లని శిరోజాల మధ్య

కాస్త పాలిపోయినట్టున్న ముఖం మబ్బుల్లోని చంద్రుడిని గుర్తుతెస్తున్నది

ఏదో అనుభూతిలో గొంతు నిండుకొచ్చి నట్లైంది విజయ్‌కి రెండంగల్లో మంచం చేరుకొని, ప్రక్కనే కూర్చొని ఆమె చెయి పైన చెయి వేశాడు. ఏదో అనాలని ప్రయత్నిస్తే నోరు పెగల్లేదు

పరిచితమైన ఆ స్పర్శకు కళ్ళు విప్పింది సంధ్య. కళ్ళు కాంతివంతమైనాయి. ముఖం విప్పారింది.

"విజయ్" అస్పష్టంగా అంది.

"టాక్సీ వాకిట్లో వుంది వెళ్దామా ?" గుమ్మంలో నిలబడి అంది నిర్మల

హాస్పిటల్ బయట తారట్లాడుతున్న విజయ్ భుజంపైన చేయి వేశాడు రవి

"అలా దిగులుపడ్తావేమిటోయ్ ? ఎయిర్ ఫోర్స్‌లో పని చేస్తున్నవాడివి ఆ మాత్రం గుండెనిబ్బరం లేకపోతే ఎట్లాగు విజయ్ ? రేపు ఈపాటికి పాపాయిని చూసుకొని మురిసిపోతూ వుంటావు." తేలికగా మాట్లాడటానికి ప్రయత్నిస్తూ అన్నాడు

"రవీ ! సంధ్యకు ఈ బాధంతా నావలనే కదూ ?" డెస్పరేట్‌గా వుంది అతని స్వరం.

"యూ ఆర్ సిల్లీ విజయ్ ! సృష్టిలోనే వున్నది ఇదంతా నీవు, నేను ఈ ప్రపంచంలోని ప్రతి ప్రాణి ఈవిధంగా వచ్చినవాళ్ళమే. నీకు మాత్రం తెలీదూ ?" అంటూ రవి మాట్లాడుతూనే వున్నాడు నిర్మల పరిగెత్తుకు వచ్చింది.

"రవీ . . రవీ . ! పాప." ఆయాసంతో మాట్లాడలేకపోతున్నది.

"సంధ్య..." ఆత్రంగా అడిగాడు విజయ్.

అప్పుడు చూసింది విజయ్‌ని "మీ ఆవిడ బాగానే వున్నదండీ ! మీ అమ్మాయి 'నాన్న కావాల'ని అంటోంది !"

లోపలికి పరిగెత్తాడు విజయ్

"రవీ ! పాప ఎంత బాగుందనుకున్నావు ? మల్లెపువ్వులాగా, సుకుమారంగా —" ఏదో చెప్పబోతున్న నిర్మలను ఆపాడు రవి

"అటువంటి పాపాయి మనకు స్వంతం కావాలని అనిపించటంలేదూ ?" కొంటెగా అడిగాడు

కోపంగా చూసింది నిర్మల ఏదో జవాబు చెప్పాలనుకుందికాని ముఖం ఎర్రబడి ఏమీ అనలేక పోయింది లోనికి పారిపోయింది

* * *

"సంధ్యా, నేను వచ్చేదాకా హాస్పిటల్‌కే రానన్నావుట ... అలిగితే అన్నం మానేసినట్లు, కనటం మానేద్దామనుకున్నావా ?"

"నెప్పులు మొదలయేసరికి నాకెందుకో భయంవేసింది విజయ్ ! చచ్చిపోతానేమోననుకున్నా ... చావంటే భయం కాదు ... నిన్ను చూడకుండా వెళ్ళిపోతానేమోనని భయం !"

నవ్వాడు విజయ్ "మై లవ్" అంటూ మృదువుగా ఆమె ముంగురులు సవరించాడు.

"పాపకి ఏం పేరు పెడ్దాం ?" అడిగింది సంధ్య

"నీ యిష్టం."

"కొన్ని పాత పేర్లు చాలా అందంగా వుంటాయి "

"నిజమే ! ఉదాహరణకు 'రాధ' అన్న పేరు ఎంత బాగుంటుంది !"

విస్మయంగా చూసింది సంధ్య "సరిగ్గా నేననుకున్న పేరూ అదే !"

"ఇద్దరం ఒకే పేరు మెచ్చటం హౌ లవ్లీ !"

గుప్పెట్లు మూసుకొని ప్రశాంతంగా నిద్రపోతున్న రాధను చూస్తుంటే గుండెలనిండా పొంగుకొస్తున్న అనురాగం సంధ్యకు ఓ రకమైన ఆశ్చర్యాన్నే కలిగిస్తున్నది. ఇంతటి మమత సాధ్యమా -- అనే సందేహాన్ని కలిగిస్తున్నది తనలోని మమత. ఈ పాప తనలోని భాగం విజయ్‌లోని భాగం ... తమ ప్రేమ చిహ్నం ... తామిద్దరి మధ్య మమతల వంతెన వేసే చిన్నారి.. బుగ్గపై వేలుతో తాకింది మెత్తగా వుంది అప్రయత్నంగా పాప అరచేతిని తన పెదవులపైన వుంచి ముద్దుపెట్టుకుంది ఆ అనుభూతి తన్మయత్వాన్నే కలిగించింది

కళ్ళు మూసుకొని తన్మయత్వంలో తేలిపోతూంటే, పాప ఏడుపుతో ఉలిక్కిపడింది ఇప్పుడేకదూ ముచ్చటగా నిద్రపోయింది ? అప్పుడే ఏడుస్తున్నదే ? దగ్గరగా తీసుకొని స్తన్యం పాప నోటికి అందిస్తే, తన నుంచి వస్తున్న పాలు పాప ఆకలి తీరుస్తుంటే, ఆ పాలు త్రాగిన పాప తృప్తిగా నవ్వుతూ అమాయకంగా చూస్తుంటే- ఓహ్ ! ఇది మరో విచిత్రమైన అనుభూతి !

స్త్రీగా పుట్టటం, తల్లి కావటం ఓ అద్భుతమైన వరం ! చిన్నారి రాధ మూడవ నెలలో బోర్లాపడితే సంధ్యకు ఎవరెస్టు ఎక్కినంత ఆనందం.

ఆరునెలలప్పుడు ప్రాకటం మొదలుపెడితే ఇటువంటి అపురూపమైన కృత్యం చేయటం ఎవరికయినా చేతనవుతుందా అని అబ్బురపడింది.

పదవ నెలలో తప్పటడుగులు వేస్తే గర్వంతో గుండె పొంగిపోయింది

ఏడాది వెళ్ళే సమయానికి "అమ్మా" అని పిలిస్తే "ఇంతకుమించి మరేం కావాలి ?" అంది సంధ్య మనసు

రాధతో రోజులు త్వరగానే గడుస్తున్నాయి అప్పుడప్పుడు విజయ్ వచ్చివెళ్తున్నాడు

నిర్మల, రవి పెళ్ళి చేసుకోవటానికి నిశ్చయించుకున్నారు.

సునీల్ చాలా రోజులుగా కనబడటంలేదు పెళ్ళికి అని స్వగ్రామం వెళ్ళినవాడు తిరిగి రానేలేదు అనివార్య కారణాలవల్ల పెళ్ళి పోస్ట్‌పోన్ అయిందని మాత్రం రవికి రాశాడు. తర్వాత జాబ్‌కి రిజైన్ ఇచ్చాడన్న విషయం తప్ప మరేది తెలియలేదు





పెనుతుఫాను తాకిడికి తుత్తునియలైపోయిన తెట్టు – చాకిచెర్ల మధ్య ఉన్న నెం. 503 వంతెన శిధిలాలని చిత్రంలో చూడవచ్చు మొత్తంమీద ఈ తుఫాను కారణంగా రైల్వేకి పదమూడు కోట్ల రూపాయల నష్టం సంభవించిందని అంచనా (రవాణా నష్టం రాదారి ధ్వంసం వల్ల నష్టం కలిపి)

## ఇది ఒక పాంధశాల

రాధని, నిర్మల స్నేహితుల యింటికి తీసుకు వెళ్ళింది.

ఊరికే డాబామీద చల్లగాలికి తిరుగుతున్నది సంధ్య గేటు చప్పుడయితే క్రిందకు చూసింది

సునీల్!

ఎంత మారిపోయాడు!? మనిషి నల్లబడ్డాడు. పీక్కుపోయాడు. ముఖం కళావిహీనంగా ఉంది

"సునీల్" పైనుంచి పిలిచింది. తలెత్తి చూశాడు. పెటుక్కున మెట్లెక్కి డాబాపైకి వచ్చాడు.

"సునీల్, ఏమిటిలా అయిపోయావు?" బాధగా అడిగింది సంధ్య

"ఓ సమస్యలో చిక్కుకున్నాను సంధ్యా సలహాకోసం వచ్చాను"

ముందు క్రిందికి వెళ్దాం. కాస్త టిఫిను, తీసుకున్నాక అన్నీ చెప్పవచ్చును

ఇప్పుడే హోటల్‌లో తీసుకువస్తున్నాను విజయ్, రాధ, నిర్మల, మీ పేరెంట్స్ అంతా బాగున్నారా?

తలూపింది.

ఇద్దరూ పిట్టగోడదగ్గరున్న కుర్చీలలో కూర్చున్నారు సునీల్ తన కథ మొదలుపెట్టాడు

7

మీనా అత్యంత సౌందర్యవతి ఆ సౌందర్యమే సునీల్‌ని ఆకర్షించింది కవ్వించింది.

'మీనా లేకపోతే బ్రతకలేను' అనే ఫీలింగ్ కలిగించింది మీనాకీ సునీల్ బాగా నచ్చాడు పెళ్ళి స్థిరం చేసిననాడు ఇద్దర్లూ ఎంత ఆనందం అనుభవించారనీ! ఏడాది వరకు పెళ్ళి చేయకూడదని పరిస్థితులు వస్తే ఎంత నిరాశ చెందారో!

ఉత్తరాలు రాసుకుంటూ, ఫోటోలు పంపించుకుంటూ కాలం గడపాలంటే బాధగానే వుండేది కాని ఏడాది దూరమూ ఇద్దరినీ మరింత దగ్గిరగా వేసింది ఒకరికోసం మరొకరు వేచియుండటమనేది బాధే. కాని అది తీయని బాధ! రోజూ ఉత్తరంకోసం ఎదురుచూడటం; చదువుతూ అవతల వ్యక్తిని ఊహల్లో నిలుపుకోవటం; తిరిగి కమ్మని కబుర్లు వ్రాయటం – అదో మధురమైన సమయం.

ఫోటోలు పంపుకోవటం, చిన్న చిన్న గిఫ్టులను అందించటం, ఆ గిఫ్ట్సులో అవతలి వ్యక్తి ప్రేమని గుర్తించటం లోకమంతా సుందర స్వప్నంగా కనిపించిన రోజులవి!

సునీల్ పంపిన చీర కట్టుకున్ననాడు మీనాకి గాలిలో తేలిపోతున్నట్లే వుండేది.

మీనా పంపిన పెన్‌తో రాసుకుంటుంటే, ప్రపంచాన్నే జయించినట్లుండేది సునీల్‌కి –

బంగారుకలలతో సామ్రాజ్యాలనే ఏలిన రోజులవి.

ఏడాది ఎదురుచూడటమూ పూర్తయింది పెళ్ళికి ముహూర్తం నిశ్చయమయింది. పెళ్ళయినాక ఎటువంటి ఇంట్లో వుండాలి – ఎట్లా కాలం గడపాలి – ఎందరు పిల్లల్ని కనాలీ– ఎన్నెన్ని ఆలోచనలు? ఎన్నెన్ని పథకాలు?!

కోటి ఊహలతో, శతకోటి ఆశలతో ముహూర్తానికి పదిరోజులు ముందుగా స్వగ్రామంలో అడుగుపెట్టాడు.

స్టేషనుకి మీనా రాకపోవటం ఆశ్చర్యమనిపించింది మనసెందుకో కీడు శంకించింది.

తమ ఇంటి ముందు బండి దిగాడు. వాకిట్లో పందిరి లేదు. తోరణాలేవీ లేవు.

అర్థంకాని భయంతో ఇంట్లోకి వెళ్ళాడు తల్లి, తండ్రి, అన్న, వదిన అంతా విషాదంగా వున్నారు

"ఏమయింది? ఏమయింది?" ఆత్రంగా అడిగాడు.

ఎవరూ మాట్లాడలేదు కాస్సేపు. తర్వాత వదిన చెప్పింది, "మీనాకి నాలుగురోజులుగా జ్వరంవస్తున్నది నిన్ననే తెలిసింది–మశూచికంట– సీరియస్‌గా వుంది పరిస్థితి"

చుట్టూరా ఉన్న భూమి గిర్రున తిరిగినట్లే అయింది. కాళ్ళు వణుకుతుంటే నిలబడినచోటే కూలబడ్డాడు.

తల్లి దగ్గరకు వచ్చింది "మన చేతిలో ఏదీ లేదు బాబూ! ఆ దేవుడిని నమ్ముకుని ధైర్యంగా ఉండటానికి ప్రయత్నించాలి." ధైర్యం చెప్పటానికి ప్రయత్నిస్తున్నా, ఆవిడకు కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. వాళ్ళందరికీ తెలుసు, సునీల్, మీనా ఎంతగా ప్రేమించుకున్నారో!

చెల్లి గ్లాసులో మంచినీళ్ళు తెచ్చియిచ్చింది వాటితో గొంతు తడుపుకొని బయటపడ్డాడు. అన్నయ్య వెంటనే వచ్చాడు మీనా యింటికి వెళ్ళాడు. గుమ్మంలోనే తెలిసింది ఉదయమే సీరియస్‌గా అవటంతో హాస్పిటల్లో చేర్చారని.

అంటరాని వ్యాధుల ఆసుపత్రిలో లోనికి ఎవ్వరినీ రానివ్వరు. రోగిని వాళ్ళ చేతుల్లో అప్పచెప్పి, బయట నిలబడవలసిందే.

సునీల్ మనసులోని సుడిగాలిని వర్ణించటానికి మాటలు చాలవు.

"మీనా! నువ్వు బ్రతకాలి! నువ్వు లేనిదే నేను ఉండలేను! నాకోసమయినా నువ్వు బ్రతకాలి మీనా! ప్లీజ్ మీనా! వెళ్ళిపోకు!" మనసులోని బొమ్మను ఏవేవో అర్థిస్తూ ఉండిపోయాడు.

మీనా తల్లితండ్రులు, సునీల్ తల్లితండ్రులు అంతా బాధపడుతున్నారు. లోపల హాస్పిటల్‌లో చావుబ్రతుకులమధ్య పోరాడుతున్న మీనాను తలుచుకుంటే దుఃఖం ఆగడంలేదు వాళ్ళకి. ఇక్కడ హాస్పిటల్ బయట పిచ్చివాడివలె మథనపడుతున్న సునీల్‌ని చూస్తుంటే గుండె చెదిరిపోతున్నది.

సునీల్ మనసులో అనుకుంటూనే ఉన్నాడు "మీనా, ఎలాగయినా బ్రతకాలి నువ్వు! బ్రతకాలని నిశ్చయం చేసుకో! చావును జయించు! నీ సునీల్‌తో కలసి జీవితం పంచుకోవాలనుకున్న విషయం మరిచిపోయావా? మన రంగురంగుల కలలు గుర్తులేవూ? మీనా, వెళ్ళిపోకమ్మా. భగవాన్, నిన్నెప్పుడూ ఏదీ కోరిన గుర్తులేదు అసలు నువ్వున్నావో లేదోకూడా నా మనసుకి ఎన్నడూ పట్టలేదు. నువ్వనేవాడివి ఉంటే, నీకు మనసు, ప్రేమ అనే మాటల అర్థం తెలిస్తే నా మీనాను రక్షించు. మీనా లేని శూన్యంలో నేనెలా ఉండగలను? మీనా . మీనా..."

ఇట్లా పరిపరి విధాల దుఃఖిస్తూ ఉన్న సునీల్‌కి మీనా ప్రమాదస్థితిని దాటిందనే వార్త అంతులేని ఉత్సాహం కలిగించింది.

అందరి ముఖాల్లోనూ సంతోషం!

అందరినీ చుట్టివేస్తున్న ఆనందతరంగాలు!

అయినా అప్పుడే మీనాను చూడటానికి వీల్లేదన్నారు. ఇమ్మ్యూనైజేషన్ ఇంజక్షన్ ఇచ్చి తల్లిని మాత్రం లోనికి వెళ్ళమన్నారు.

ఆ రాత్రికి స్పృహ వచ్చిందని, అందరి గురించి అడిగిందని చెప్పింది ఆవిడ మర్నాడు గబగబా నాలుగు లైన్సు రాసి మీనాకు ఇవ్వమని ఆవిడ చేతికి చీటీ యిచ్చాడు

"మై లవ్, మృత్యుముఖం నుంచి బయట పడ్డావు – నాకోసమే కదూ? ఎప్పుడెప్పుడు హాస్పిటల్ నుంచి విడుదల అవుతావా అని

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.

నైసిల్
ఉపయోగించండి.
అతిశీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడరు



చెమటకాయల పౌడర్ మాత్రమే మీకు దురదలు, మంటల చికాకుల నుండి అతి శీఘ్రంగా ఉపశమనము నిస్తుంది.
ప్రత్యేకమైన ఔషధీయుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి దశలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను ఆపుతుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారియైన సూక్ష్మ జీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది.

2 ప్యాక్‌లలో దొరుకును — "బ్లూ" మరియు "శాండల్ వుడ్"

Glaxo
nycil*
PRICKLY HEAT POWDER

**నైసిల్ పొందండి.**
**చెమటకాయలను మరువండి.**
**కేవలం 6 రూపాయల 63 పైసలు.***

*గరిష్ఠ రీటైల్ ధర. స్థానిక పన్నులు అదనం

Sista's-GN 79-364-Tel



తుఫాను భీభత్సంలో కొట్టుకుపోయిన వంతెన, తెగిపోయిన రైలు పట్టాలు, వాటిమీద మేట వేసిన చెత్తా చెదారం ఇది విజయవాడ – గూడూరు సెక్షన్‌లోని నెం. 530 వంతెన స్థితి.

ఎదురుచూస్తూ క్షణమొక యుగంలా గడుపుతున్నాను —నీవాడు, సునీల్''

సునీల్ ప్రేమే మీనాకు శక్తినిచ్చిందో, సునీల్‌ని చూడాలన్న ఆత్రుతే బలాన్నిచ్చిందో, హాస్పిటల్ డాక్టర్లే విస్మయపడేటంత కొద్దికాలంలో కోలుకుంది

మర్నాడు యింటికి పంపిస్తారనగా మీనా కోసం ఏదయినా కొనటానికి బజారుకు వెళ్ళాడు సునీల్

అనుకోకుండా ఆరోజే మీనాని డిశ్చార్జి చేశారు ప్యాకెట్లతో మీనావాళ్ళ ఇంట్లో అడుగు పెట్టేసరికి చిన్నతమ్ముడు ఎదురొచ్చి ''అక్క ఇంటికి వచ్చేసింది!'' అన్నాడు

ఎన్నాళ్ళకు మీనాను చూడటం! ఏదో ఉద్వేగంతో గుండె వేగంగా కొట్టుకోసాగింది.

మీనా తల్లి వచ్చింది ''ఆ గదిలో పడుకుంది నాయనా'' అంది అతని ఆత్రంలో ఆవిడ ముఖంలో క్రమ్మిన నీలినీడలను అతను గమనించలేదు.

దగ్గరగా వేసివున్న తలుపులను నెట్టాడు మంచంపైన గోడవైపుకి తిరిగి పడుకొనివుంది మీనా ఆ పోజులో శరీరపు ఒంపులు యెంత అందంగా వున్నాయో! పసుపురంగు జార్జెట్ చీర, అదే రంగు బ్లౌజు ''బంగారుబొమ్మ'' అని మురిపెంగా అనుకుంటూ వెళ్ళి ప్రక్కనే కూర్చుని మెద చేయి వేస్తూ ''మీనా'' అని పిలిచాడు మృదువుగా

అప్పుడు గమనించాడు మీనా ఏడుస్తున్నదని అతని స్పర్శకు ముడుచుకుపోయి దిండులో తల దాచుకొని మరింత రోదించసాగింది.

''మీనా! మీనా! ఏమిటది? ఎందుకు? మన కష్టాలన్నీ తీరిపోయాయిగా, ఇక ముందున్నవన్నీ మంచిరోజులే'' అనునయంగా అంటూ, వీపుమీద పరుచుకున్న వెంట్రుకలు సరిచేశాడు

మీనా తలెత్తటంలేదు ఏడుపు ఆపటంలేదు.

''ఊరుకో, డియర్'' పదే పదే అంటూ బలవంతంగా ఆమె తలను పైకెత్తి ఒళ్ళో పెట్టుకోబోయాను

## ఇది ఒక పాంథశాల

అంతే! అదిరిపడ్డాడు! అందమైన మీనా ఇప్పుడు అందంగా లేదు. ముఖం నల్లబడి మశూచికంవలన గుంటలు ఏర్పడి వికృతంగా ఉంది.

''మై గాడ్!''

తనకు పరిచయమైన సుందరి కాదు ఈ మీనా

తనను కవ్వించి, మురిపించిన ముఖం కాదది.

అయస్కాంతంవలె తనను ఆకట్టుకున్న వ్యక్తి ఈ కురూపి కాదు

చూపులకే భయం కలగించే ఈ రూపం తన ప్రియురాలిది కాదు.

అయినా .. తన కాబోయే భార్య — మీనా - వెక్కి వెక్కి ఏడుస్తున్నది మనసు కదిలిపోయింది

''మీనా.. ఊరుకో'' బొంగురుగా ఉన్న సునీల్ స్వరం అతనికే ఫాల్స్‌గా వినిపించింది

''సునీల్! అంతా నా ఖర్మ ఈ ఖర్మకి నీవు శిక్ష అనుభవించవలసిన అవసరంలేదు. మాట యిచ్చినందుకు నన్నే పెళ్లి చేసుకోమని డిమాండ్ చేసే మూర్ఖురాలిని కాను... మన ఎంగేజిమెంటు బ్రేక్ చేస్తున్నాను... నీ యిష్టం ఇక!'' కళ్ళు తుడుచుకొని చెప్పింది.

సునీల్ మనసు ద్రవించింది. అతనిలోని సంస్కారం వెంటనే అతనిచేత అనిపించింది, ''డోన్ట్ బి సిల్లీ మీనా .. రూపం ఏదయితేనేమి, నీవు నాదానివే!''

కాని మీనా ఒప్పుకోలేదు. ''నేను అంతా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను నీవు నన్ను పెళ్ళి చేసుకునేకంటే, యింకో అమ్మాయిని చేసుకుంటే నాకు ఆనందంగా వుంటుంది'' అంది

సునీల్ వినిపించుకోలేదు ''అసలే వీక్‌గా వున్నావు .. ఈ పిచ్చి ఆలోచనలు మానెయ్!'' అంటూ ఓదార్చాడు. కాని అతను ఆమె ముఖంకేసి చూడలేకపోతున్నాడు. కళ్ళలోనికి సూటిగా చూసి మాట్లాడలేకపోతున్నాడు. తన ఓదార్పు మాటలు తనకే నాటకంగా అనిపించాయి ఎట్లాగో తమాయించుకుంటూ అన్నాడు, ''మీనా, పెళ్ళయినాక ఈవిధంగా జరిగిందనుకో! అప్పుడు ఏం చేసేవాళ్ళం?''

''అప్పుడు అదే మనకు విధిలిఖితం అనుకొనే వాళ్ళం ... కాని ఆ ముడి పడకముందే యిలా గయిందంటే నీకు అటువంటి ఖర్మ తప్పటానికే ననుకోవాలి ... నా మాట విని వెళ్ళిపో సునీల్! ప్లీజ్, వెళ్ళిపో!''

మీనా మనసు, దుఃఖం అతన్ని మరింతగా కదిలిస్తున్నాయి. ''పోని ఓ మాట చెప్పు, ఈ విధంగానే ఓ రోగమో, ప్రమాదమో నాకే వచ్చి ఇలా అయిందనుకో, నీవు నన్ను కాదని వెళ్ళిపోతావా?''

''అటువంటి మాటలనకు! స్త్రీ పురుష స్వభావాలు పూర్తిగా వేరు.. కురూపి భార్యతో జీవితాంతం గడపటం చాలా బాధాకరం సునీల్.''

చాలాసేపు ఈ ధోరణిలో ఏం మాట్లాడుకున్నా, ఒకరినొకరు ఒప్పించుకోలేకపోయారు.

చివరకు మీనా అంది ''ఆల్‌రైట్, సునీల్ మనం పెళ్లి చేసుకుందాం కాని ఓ షరతు ఇప్పటికి నీవు వెళ్ళిపో. నెల రోజులు నన్ను చూడటానికి రావద్దు. ఈ నెల బాగా నిదానంగా ఆలోచించుకో. సరిగ్గా వచ్చే నెల ఈ రోజుకే ఇక్కడికి రా. అప్పటికీ నీ నిర్ణయం ఇదే అయితే పెళ్ళి చేసుకుందాం — చూడు సునీల్, అంత్య నిష్ఠూరంకంటే ఆది నిష్ఠూరం మేలంటారు పెళ్లి చేసుకున్నాక, నిన్ను ఎవరయినా చిన్నచూపు చూస్తున్నారనిపిస్తే నీవు బాధపడితే, 'నా ఖర్మ ఇలా అయిందే' అని ఎప్పుడయినా అనుకుంటే నాకు మనస్సు చివుక్కుమంటుంది... నీవు సుఖంగా ఉండాలనే నా కోరిక. . నీవు బాధపడ్తావేమోననే నా బాధ. . ఇంక నాతో వాదించకు సునీల్, నేను చెప్పినట్లు నెల తర్వాత రా!''

* * *

అంతా చెప్పాడు సునీల్ ''సంధ్యా, ఇది సంగతి! ఇంకొక రెండురోజుల్లో నెల పూర్తవుతుంది. మీనాకి ఏం చెప్పాలో అర్థంకావటంలేదు.''

''ఇంకా నిశ్చయం చేసుకోలేదా?''

''మీనా దగ్గర్నుంచి వచ్చేసిన క్షణానే, నెల కాగానే వెళ్ళి తననే చేసుకుంటానని చెప్పాలని నిశ్చయించుకున్నాను. కాని తను చెప్పినట్లు నిజంగానే నిదానంగా ఆలోచించసాగింది నా మనసు

ఓ సినిమాకో, షికారుకో వెళ్ళినపుడు ముమ్మల్నిద్దర్నీ జనం వింతగా చూస్తే నాకేమనిపిస్తుంది?

ఏ స్నేహితులైనా ఇంటికి వచ్చినపుడు ''నా భార్య — మీనా'' అని పరిచయం చేసినపుడు మీనాకేసి ఆశ్చర్యంగా, ఆపైన నాకేసి జాలిగా చూస్తే — నాకెలా వుంటుంది?

ఎవరి ఇంటికయినా, ఏ పార్టీకయినా తీసుకు వెళ్ళాలంటే తనకు నామోషి అనిపిస్తే?

ఇదంతా మీనా భరించగలదా? నేను భరించగలనా?

అంతరంగ సౌందర్యం అనేది ఒకటి వుందని నాకూ తెలుసు మీనాకు ఈ సౌందర్యం మెండుగా వుందనీ తెలుసు

# “ఈగిల్ ప్రిన్సెస్ గురించి వేరే చెప్పాలా?”






**“ఇది అందమైనది...”**

అతిథ్యం ఇచ్చే మోహనాంగి.

**“ఇది అద్వితీయమైనది...”**

దుమ్మును ఏమాత్రం లోనికి పోనివ్వదు...24 గంటలకు పైగా వేడిని ఏమాత్రం బయటికి రానివ్వదు.




**“మరేమిటనుకున్నారు, ఇది ఈగిల్ వాక్యూమ్ ఫ్లాస్క్.”**




**ఈగిల్ శ్రేణిలో 123 వేర్వేరు నమూనాలు.**

CASE-113-244-TEL

## డాక్టర్ సలహాలు

ఎస్. ఎస్. ఆర్. — గుత్తి

మూడు నెలల క్రితం మావారికి మెడ క్రింద బొల్లి లాంటి మచ్చలు బూడిద రంగులో మొదలయినవి. క్రమంగా అవి మెడ అంతా అల్లుకుపోయినవి. ఇవి వళ్ళంతా వస్తాయేమోనని భయముగా వున్నది. దీనికి ఏమి చెయ్యాలి?

★ ఇలాటి తెల్ల మచ్చలకు ఆయుర్వేద శాస్త్రరీత్యా, కేంద్రీయ జాతీయ — వైద్య విధానాల అనుసంధాన సంస్థ (సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ రిసెర్చ్ ఇన్ ఇండియన్ మెడిసిన్ — న్యూఢిల్లీ) వారిచే దేశంలో కొన్ని కేంద్రాలలో నమ్మతగిన మందుని వాడుతున్నారు. ఫలితాలు గూడా నేను స్వయంగా చూసాను గనుక బాగున్నవనే చెప్పాలి.

మద్రాసులో పై సంస్థ నిర్వాహకంలో వున్న కేంద్రం పేరు — విలాసం: డా॥ లక్ష్మీపతి యూనిట్, (ఫర్ రిసెర్చ్ ఇన్ ఇండియన్ మెడిసిన్; సి. సి ఆర్ ఐ ఎం హెచ్.)

ది వాలంటరీ హెల్త్ సర్వీసెస్, మెడికల్ సెంటర్, అడయారు, మద్రాసు — 600 020.

ఈ కేంద్రం పనిచేసే కాలం — ఉదయం 10 గం. నుండి సాయంత్రం 5 గం.ల వరకు ఆదివారాలు, కేంద్ర ప్రభుత్వ శెలవురోజులు మినహా పైవిధంగా తెల్లటి శోభిమచ్చలు నిరంతరంగా వున్నవారు వీరి సలహా పొందండి.

ఎస్. జి. బి. — ఏలేటిపాడు

నా వయస్సు 20 సం. లు నాకు ఒక సంవత్సరం నుండి పై పెదవిపైన ఒక అంగుళం మేర నల్లటి వెంట్రుకలు మొలిచాయి. పసుపు, కొన్ని ఆయింట్‌మెంట్లు వాడినాను కాని ప్రయోజనం కన్పించలేదు.

★ సహజత్వానికి విరుద్ధంగా వెంట్రుకలు ఒకచోట మాత్రమే రావటం, అందులోనూ స్త్రీలలో ఏర్పడటం వారిలో ఏర్పడిన హార్మోనుల ఉత్పత్తిలోని మార్పులనే తెలియజేస్తుంది. స్త్రీ, పురుషుల ఇద్దరిలోనూ ఇరువురి ప్రత్యేకతలను ఎత్తిచూపే హార్మోనులు ఉత్పత్తి అవుతాయి. అయితే మామూలుగా స్త్రీలలో పురుషత్వం హార్మోన్లు, పురుషులలో స్త్రీతత్వ హార్మోనులు వారిలో నాశనం చేయబడుతాయి. ఇలా జరుగక పోయినా, లేక ఈ మార్పు మందగించినా, మీరు వ్రాసిన లక్షణాల వంటివి ఏర్పడతాయి. దీనికి వైద్యంగా మీరు స్త్రీ సహజ "ఈస్ట్రోజెన్, ప్రొజెస్టెరాన్" అనే వాటిని వైద్య పర్యవేక్షణలో వాడటం మంచిది.

ఎల్. పి. — హైదరాబాద్

మా పాప వయస్సు 8 సంవత్సరములు 2 సం. ల క్రితం టైఫాయిడ్ వచ్చినది. ఆతర్వాత పక్కలోనే మూత్రము విసర్జిస్తున్నది. మామూలుగా కూడా స్నేహితులతో ఆడునపుడు మూత్రము విసర్జిస్తుంది. చాలా సిగ్గుపడుతోంది. మానసికంగా బాధపడుతున్నట్లు కన్పిస్తోంది.

★ మూత్రకోశానికి (యూరినరీ బ్లాడర్) వెళ్ళే నరాలు బలహీనత చెందినపుడు యిలా జరుగుతుంది. టైఫాయిడ్ జ్వరం మూలంగా ఇలా ఏర్పడుతుంది. ఆ సమయంలో సరియైన ఆహారం లేకపోవటంవల్ల ఏర్పడే బలహీనత, ఎక్కువగా పడుకునే వుండటంవల్ల వీపు నుంచి మూత్రాశయానికి వెళ్ళే నరాలు వత్తిడి చెందటంవల్ల ఇలా ఏర్పడివుంటుంది.

దీనికి ప్రత్యేక చికిత్స అనవసరం. కొద్దిగా శ్రమ అయినా కాల్రక్రమేణా ఆ అలవాటు నుంచి తప్పించవచ్చును. ఇలా చేయటాన్ని ఆంగ్లంలో "సెల్ఫ్ కంట్రోల్" అంటారు. కడుపు భాగం మీది కండరాలకి వ్యాయామం కలుగజేయటంవల్ల కూడా చాలా మేలు కలుగుతుంది.

ఎస్. వి. — చిత్తూరు

నాకు 25 సం.లు 5 సం. ల నుండి తల తిప్పటం మొదలయినది ఇది మొదలయిన తర్వాత రెండు కాన్పులు కూడా అయినవి తల దిమ్ముగా తల నరాలు తెగిపోతాయేమో అన్నంత బాధగా వుంటుంది నాకు 'పెరాల్‌సిస్' వస్తుందేమోనని భయముగా వున్నది 'పెరాల్‌సిస్' రాకుండా ముందు జాగ్రత్తలేమైనా వున్నాయా ఒక డాక్టర్ '**అనీమియా**' అన్నారు ప్రతిక్షణం పడిపోతానేమో భయముగా వుంటుంది

★ తల తిరిగినట్లు, కళ్ళు బైర్లుకమ్మినట్లు వుండటంవల్ల 'పెరాలిసిస్' వస్తుందనేది చాలా పొరపాటయిన ఊహ. శరీరంలో ఇనుపధాతువు (ఐరన్) తగ్గి తద్వారా హిమోగ్లోబిన్ ప్రమాణం తగ్గి 'అనీమియా' అనే రోగం ఏర్పడుతుంది.

ఈ రోగ లక్షణాలలో ముఖ్యమైనవి తల తిరగటం, ఆయాసం, అలసట, పని చేస్తే లేక ఎక్కువ నిలబడితే కాళ్ళు వాయటం మొదలైనవి ఏర్పడతాయి. పెరాలిసిస్ రాకుండాచూసుకోవాలంటే మీరు ముందుగా రక్తాన్ని పరిశుభ్రం చేసుకోవాలి.

ఎం. వై. ఎల్. ఎస్. ఎ. — బేగంపేట

"మెనోపాసల్ స్టేజ్" అంటే ఏమిటి? స్త్రీలకు అది ఏ వయస్సులో వస్తుంది?

★ స్త్రీలకి సహజమైన ఋతుక్రమం వయస్సు మీరిన కొద్దీ, క్రమం తప్పటం ఒక వయస్సులో పూర్తిగా ఆగిపోవటాన్ని 'మెనోపాసల్ స్టేజ్' అంటారు. ఇది సాధారణంగా స్త్రీలకు 45 — 50 సం.ల లోపున ఏర్పడుతుంది కొందరికి 45 సం.ల వయస్సుకి ముందుగా కూడ యిలా జరిగే అవకాశం వున్నది.

జి. ఆర్. ఎమ్. — మహబూబ్ నగర్

బట్టతల వంశపారంపర్యముగా వస్తుందా ఇది రాకుండా వుండటానికి ఏమైనా అవకాశాలు వున్నాయా?

★ బట్టతల వంశపారంపర్యంగా రావటం ఎలువురి కుటుంబాలలో ప్రబలివుండటం సహజమే. శరీరతత్వాన్ని నిర్మాణాన్ని నిర్ణయించేవి జీవకణాలలోని (సెల్స్) 'జీన్సు' అనబడే పరమాణువులే. ఈ జీన్సు ద్వారానే తల్లి, తండ్రి ఇరువైపుల వారి లక్షణాలను పుణికిపుచ్చుకొని 'పోలిక'నే పేరుతో పిల్లలని వ్యవహరించటం జరుగుతుంది. దీనిని రాకుండా చేయటానికి ప్రత్యేక మార్గాలుగాని మందులుగాని లేవనే చెప్పాలి

— డా॥ కె. వెంకటేశ్వరరావు

---

## ఇది ఒక పాంథశాల

కాని అది చూడగానే కనబడదు కదా? అది చూడలేని వాళ్ళ చూపులు, మాటలు, ప్రవర్తన — అంతా సహించటం కష్టం కాదూ?

నాకయినా సదా కంటికి కనబడేది బాహ్య రూపమే కదా? అంతటి వికృత రూపాన్ని చూడటం చేదుమందు మింగినట్లు ఉండదూ?

ఎందుకొచ్చిన అవస్థ? మీనా అంతా అర్థం చేసుకుంది కనకనే, తనని మరచిపొమ్మని చెప్పింది

కాని... కాని ... ఆకాశంలో ముచ్చటగా ఎగిరే విహంగాన్ని మెచ్చుకోలుగా చూసినట్లే మీనా అందాన్ని నేను మెచ్చాను

వేటగాడి బాణానికి నెత్తురు చిమ్ముతూ విహంగం రాలినట్లే, విధి క్రూరత్వానికి గురయింది మీనా — అందాన్ని కోల్పోయింది. నేలను పడి విలవిల తన్నుకుంటున్న పక్షిని చూసి అసహ్యించుకొని కాలితో అవతలకి తన్నేసి వెళ్ళిపోవటం మానవత్వమేనా?

ప్రేమవాహినితో అలరించిన మీనాపైన నాకున్న ప్రేమ యింతేనా?

అలాగని పెళ్లి చేసుకొని, ఎదురయే ప్రాక్టికల్ ప్రాబ్లెమ్స్‌ని ఎదుర్కోగలనా?

ఈ ప్రశ్నలకు జవాబులు చిక్కటంలేదు. ద్వైదీభావాలతో నలిగిపోతున్నాను చెప్పు సంధ్యా ఏం చేయను?

కాసేపు మౌనంగా ఉండిపోయింది సంధ్య

"ఓ ప్రశ్న అడుగుతాను సునీల్, సమాధానం చెప్పు. మీనా లేని జీవితం ఊహించుకుంటే ఎలా అనిపిస్తుంది?"

"శూన్యంగా అనిపిస్తున్నది."

"ఒకటి, రెండేళ్ళు గడిచాక మనస్సు త్రిప్పుకొని మరెవరినయినా జీవితంలోకి ఆహ్వానించగలవా?"

"అది మాత్రం అసాధ్యం. మీనాని పెళ్లి చేసుకున్నా, చేసుకోకపోయినా ఈ జీవితాన్ని మరొకరితో పంచుకునే ప్రసక్తి లేదు" ఖచ్చితంగా అన్నాడు.

"అయితే మీనాను పెళ్లి చేసుకో సునీల్! ప్రాబ్లెమ్స్‌ని ఎదుర్కొనే ఆత్మస్థైర్యం దానంతట అదే వస్తుంది! మీ ప్రేమే మీకు శక్తినిస్తుంది."

సునీల్ ముఖం విప్పారింది "దట్స్ రైట్ సంధ్యా! మీనా ప్రక్కనుంటే ఎటువంటి సమస్యలకీ భయపడే అవసరంలేదు" మాటలో చిత్తశుద్ధి, నిజాయితీ ప్రతిఫలిస్తున్నాయి.

[ఇంకా వుంది

# "నాకు కావాలి - సన్-సిప్ తేవాలి!"



## కొత్తది సన్-సిప్ స్క్వాష్‌లు

**అరెంజ్, మేంగో, లెమన్**

ప్రతిరోజూ సన్-సిప్ తాగండి.. నోరూరించే
ఈ మూడు రుచులలో దేనినైనా సరే
నేడే కొనండి మీ ఊళ్ళోదొరికే వాటిల్లో
తాజా అయిన పండ్ల రుచిగల స్క్వాష్‌లు

**తాజాదనంచిందించే ఆ పండ్ల రుచిని**
**అనుభవించి చూడండి—నేడే**

everest/79/WL/120-తె

తుందా ?" ఆదుర్దాగా ప్రశ్నించాడు పున్నయ్య.

"కొండంత అండ మీరుండగా ... నేను సాధించలేనిదేమీ లేదు మీ అమ్మాయి మనసిప్పుడు పూర్తిగా మారిపోయింది! ఎవరు దేవుడు? అని అడగండి! మీ పేరే నాన్నా! అంటుందో, లేదో...?" అన్నాడు ఆనంద్ ఆనందంగా.

"థాంక్యూ ఆనంద్! ఆడపిల్లల తండ్రులకి నీ లాంటి సహాయాలు కల యువకుల చాలా అవసరం!" మెచ్చుకున్నాడు పున్నయ్య.

"చాల్లెండి! అలా పొగడకండి సార్! ఆయుష్షు క్షీణం!" సిగ్గుపడ్డాడు ఆనంద్.

అదే సమయంలో... పెరటి గోడ దగ్గర ఎవరో దూక్కుంటున్న శబ్దం వినిపించింది. ఇద్దరూ కంగారుగా అక్కడికి పరుగెత్తారు.

ఆ శాలి సుందరి!

నిర్ఘాంతపోయారిద్దరూ.

పున్నయ్యలోని పులి మళ్ళీ పంజా విప్పింది. కోపంతో వణికిపోతూ "చెప్పు! ఎవడువాడు? ఎందుకు వేశావిలా?" అన్నాడు మీది మీదికెళ్ళి.

ఈసారి సుందరి భయపడలేదు. పులిని చూసి వణికిపోలేదు. నిర్భయంగా "నా ఇష్టం! ఎవడో ఒకడు! దారిన పోయే వాడయ్యా! మీ పక్కన నిల్చున్న ప్రబుద్ధుడు మాత్రం కాదు. ఈ వివరాలు చాలా? ఇంకేమన్నా కావాలా?" నిర్లక్ష్యంగా ఇంట్లోకి నడిచి వెళ్ళిపోయింది.

"ఎంత పొగరు దీనికి?" పళ్ళు పటపట నూరాడు పున్నయ్య. "దీని అంతు తేలుస్తాను!" అంటూ అక్కడున్న గన్నేరు చెట్టు కొమ్మ విరగదీయబోయాడు. ఆనంద్ పున్నయ్యని వారించుకుని... సమాధాన పరచాడు. "నేను కనుక్కుంటాగా? అసలు విషయమేమిటో? మీరు శాంతించండి! తొందరపడి ఏదన్నా అఘాయిత్యం చేస్తే మనకే నష్టం. అయినా... నాకూ ఆశ్చర్యంగా వుంది. సామాసామిలం ఇద్దరం గట్టిగా కాపలా వుండగా ఇలా ఎలా జరిగిందీ అని?!"

**ఆ మాటలతో పున్నయ్య పులిలా కాకుండా పిల్లిలా అయిపోయాడు! తన కుటుంబ పరువు ప్రతిష్ఠల్ని కూతురెలా మంటకలి**

పిందో తలుచుకుంటే... అతనికి వెన్నులోంచి వణవణ వణుకు పుట్టుకురాసాగింది.

* * *

ఆనంద్ చెప్పిన విషయం విని నోరెళ్ళబెట్టేశాడు పున్నయ్య. "తమమీద కష కొద్దీ...ఓ అర్ధరాత్రి పెరట్లోకి వెళ్ళి... కాంపౌండు గోడనానుకుని ఉన్న గదిలో లైటు వేసుకుని చదువుకుంటున్న స్టూడెంటును గట్టిగా పిలిచిందట. అతను బయటికొచ్చి సరిహద్దు గోడమీంచి సుందరిని చూసి ఆశ్చర్యపోయాట్ట! ఏమిటి? అని అడిగాడట వాడు. నీబొందా! అని నవ్వుతూ అని గోడదూకిరా! ఏమిటో చెపుతాను! అందిట సుందరి. వాడికి అసలు విషయం అర్థమయ్యేలా చెప్పటానికి తనని తామ సంతోషంగా అర్పించుకుందట సుందరి. వాడి పరీక్షలయిపోగా వాడు తనవూరికి ఉడాయించేశాట్ట!"

"పోనీ ఆ ఊరెళ్ళి వాణ్ణి బతిమాలి దీన్ని వాడికి కట్టబెడితేనో..?" తన మనసులో ఉన్న ఆలోచన వెలిబుచ్చాడు పున్నయ్య.

"భలే అమాయకుల్లా ఉన్నారు సార్! మీరు! నాకేం తెలుసు? నేను నోట్లో వేలు పెడితే కొరకలేనివాణ్ని అంటాడు ఆ స్టూడెంటు! దాంతో మీరూ నేనూ నెత్తిన గుడ్డ వేసుకుని పోలో మంటూ తిరిగి రావలసిందే!!" - మరోసారి పులిని పిల్లిని చేశాడు ఆనంద్

"కాస్తాగండి ఆలోచిద్దాం! బాగా ఆలోచించి - పరిష్కార మార్గం కనుక్కుందాం!"

ఓ నాలుగు రోజుల్ని కాలం మింగేసింది. ఆనంద్ ... పున్నయ్య ... ఇద్దరూ బుర్ర బద్దలు కొట్టుకుంటున్నారు - ఏం చేస్తే బాగుంటుందా? అని. సుందరి నిర్లక్ష్య ధోరణిలో మార్పేమీ రాలేదు పూర్తిగా బరి తెగించిన దానిలా వుంది - ఆమె పరిస్థితి.

ఆనంద్ కి ఏమీ తట్టలేదు ఎంత ఆలోచించినా. కానీ పిల్లిలా 'అయిపోయిన పున్నయ్యకి మాత్రం ఓ దివ్యమైన ఆలోచన తట్టింది. ఆనంద్ ఏమంటాడోనని భయపడ్డాడు కానీ గత్యంతరం లేక ప్రాధేయపడుతూ అడిగేశాడు ఆనంద్ ని.

తారాజువ్వలా లేచాడు ఆనంద్! "మీరడిగేదానిలో ఏమన్నా న్యాయం ఉందా సార్! ఎవడితోనో కులికి కడుపు చేయించుకున్న మీ కూతుర్ని... నేను భార్యగా స్వీకరించాలా? నామీద మీకు కోపం ఉంటే ఇంకే కఠిన శిక్ష విధించినా సంతోషంగా స్వీకరిస్తాను- ఇది తప్పు! నా మంచితనాన్ని ఇంత దారుణంగా వంచించకండి సార్! మీకు దణ్ణం పెడతాను."

"బాబూ! ఆనంద్" పున్నయ్య కళ్ళల్లో నీళ్ళు నింపుకుంటూ అన్నాడు "పెద్దవాణ్ణి! ఇవి చేతులు కావు! కాళ్ళనుకో! నిన్ను కాళ్ళా వేళ్ళాపడి మరీ అడుగుతున్నాను- కాదు- ప్రార్థిస్తున్నాను. నన్ను పాలముంచినా... నీట ముంచినా నీదే భారం! నువ్వు కాదంటే...దాన్నిరికి ముక్కలు చేసి నన్ను నేను చంపుకుంటాను! నీ దయ!" అంత పెద్దాయన అంతలా ప్రాధేయపడుతుంటే కరిగి నీరయిపోయాడు ఆనంద్.

కొన్ని క్షణాలు మౌనం తరువాత ఆర్తిగా చూస్తున్న పున్నయ్యతో నిదానంగా అన్నాడు ఆనంద్.

"నాకు ప్రస్తుతం చేసుకోవాలని లేకపోయినా... నా అంతరాత్మ నన్ను నిలవనీయటం లేదు సార్? నాకు గడ్డి పెడుతోంది. వారి ఉప్పు పులుసు కొన్నాళ్ళు తిని ఇంతవాడవయ్యావ్! ఆ రుణం తీర్చుకోవటానికి ఇంతకన్నా మంచి అవకాశం దొరకదు. ఒప్పుకో! బాధ్యతలనుంచి తప్పుకోకు! స్వార్థ త్యాగంకన్నా మించిన మహత్తరమైన గుణమేమీ లేదు— అదే మానవత్వం! అని పదే పదే ప్రబోధిస్తోంది సార్! అందుకని మీ కోసం... కేవలం మీ సంతృప్తి కోసం ...సంతోషం కోసం ... మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాను ఏర్పాట్లు కానివ్వండి!"

పున్నయ్య సంతోషానికవధుల్లేక పోయింది. దాదాపు కాళ్ళు పట్టుకున్నంత పని చేశాడు ఆనంద్ ని.

"మీరేం తప్పు చెయ్యలేదు — లేవండి" అంటూ ఆప్యాయంగా లేవనెత్తాడు ఆనంద్.

"ఛీ! ఈ నికృష్టుడి రాకవల్లే మన మధ్య దూరం ఏర్పడింది నాన్నా! నేను చచ్చినా... ఇతన్ని చేసుకోను!" అంటూ పేచీ పెట్టింది సుందరి.

"హోరెత్తావా? చంపేస్తాను! జాగ్రత్త! నువ్వు చేసిన వెధవ పనికి—అమృత హృదయుడైన భర్త లభిస్తుంటే తీసరంగా ఉందా?" అని కూతురిని ముక్క చివాట్లేసి మందలించాడు పున్నయ్య.

ఏమనుకుంటే? అసలు రహస్యం బయటికి పొక్కకుండా కూతురికి... ఆనంద్ కి పెళ్ళి జరిపించేశాను అనుకున్నాడు పున్నయ్య. ఆనంద్— సుందరిల పెళ్ళి అయిపోగానే అప్రయత్నంగా మళ్ళీ అతని చెయ్యి దుబ్బు మీసాలమీదికి వెళ్ళింది.

పున్నయ్యంటే పులి! పులి! అనుకున్నాడు ఎన్నోసార్లు.

పెళ్ళయిన వారం తిరక్కుండానే



శోభనం ముహూర్తం కూడా నిర్ణయించారు పెద్దలు. ఒకరిలో ఒకరు లీనమయిపోయి రాత్రిని స్వర్గ సుఖాల రూపంలో తియ్యగా కరిగించుకోవలసిన రాత్రి అది!!

కాని అది సుందరికి తొలి రాత్రి కాదు. ఆ సంగతి ఆనంద్‌కు కూడా తెలుసు! కనుక అది ఆనంద్ పాలిట కాళ రాత్రి!! తన కూతుర్ని సరిగా చూసుకుంటాడన్న నమ్మకం కలగలేదు పున్నయ్యకి. తన కూతుర్ని శోభనం గదిలో... తిడతాడో...? కొడతాడో...? లేక పీక నొక్కుతాడో నని అనుమాన మేసింది పున్నయ్యకి. ఒక్కసారిగా కూతురిమీద ఆప్యాయత పొంగి పొర్లింది పున్నయ్యలో. పుత్రికా వాత్సల్యం పెల్లుబికింది. అది శోభనం గది!— అన్న సంగతి కూడా మరిచిపోయి కిటికీ దగ్గరికి వెళ్లాడు. కిటికీ తలుపులు పూర్తిగా మూసి ఉన్నాయి.

ఎక్కడో గోడగడియారం కొట్టిన రెండు గంటలు వినిపించాయి. తననెవరూ గమనించటంలేదని నిర్ధారించుకుని కిటికీ వైపు

## పులి కూతురు

చెవి రిక్కించి వినసాగాడు. తను చేస్తున్నది పాపం అనిమనస్సులో అనిపించిందో ఏమో? కళ్ళు రెండూ గట్టిగా మూసుకొన్నాడు.

లోపలి నుంచి మాటలేమి వినిపించటం లేదు. కొంపదీసి తన బంగారు తల్లిని పీక పిసికివేస్తే... మాటైనా రాకుండా పడిపోలేదుకదా! భగవాన్! భగవాన్! అలాంటిదేమి జరక్కుండా చూడు! పున్నయ్య ప్రార్థన భగవంతుడు ఆలకించాడోలేదోగానీ...లోపల్నించి కిలకిల నవ్వులు వినిపించాయి ఆ నవ్వు తన కూతురిది. "హమ్మయ్య!" అనుకున్నాడు పున్నయ్య అతని గుండెలమీంచి పెద్దబండ రాయి నెవరో తీసినట్టు రిలీఫ్ ఫీలయ్యాడు పున్నయ్య.

"అబ్బ! ఉండండి! అలా చక్కిలి గింతలు పెడితే నేను ఉక్కిరి బిక్కిరి అయిపోటంలా?! ఇక బుద్ధిగా నిద్రపోతారట! శ్రీవారు! బుద్ధిమంతుడిలా!" కూతురు ఆనంద్‌ని లాలిస్తున్నట్టు ఊహించుకున్నాడు పున్నయ్య. మరి ఆరోజున ఆనంద్‌ని అలా చులకనగా ఎందుకు మాట్లాడిందో...? అర్థం కావటంలేదు పున్నయ్యకి. అంతా అయోమయంగా వుంది.

"ఇదిగో అమ్మాయ్! నిద్ర పోవటానికి కాదు ఈ రాత్రి మనిద్దరినీ ఈ గదిలో బంధించింది" ఆనంద్ నవ్వు వినిపిస్తోంది పున్నయ్యకి.

"మరి ఎందుకుట?" కొంటెగా అడుగుతోంది కూతురు.

"పులిలాంటి మీ నాన్నని పిల్లి పిల్ల చేసి ఆడించటానికి నేను వేసిన పథకంలో పూర్తిగా సహకరించి, అత్యంత సహజంగా నటించిన ఈ అందాల సుందరి అందాన్ని కొరుక్కుతినమని..."

పున్నయ్యకి మతి పోయినట్లయింది. "అయితే ఇదంతా..." అనుకున్నాడు.

ఈలోపుగా మళ్ళీ లోపల్నించి మాటలు వినిపించసాగాయ్.

"అబ్బ! బుగ్గలు నెప్పెట్టి పోతున్నాయ్! ఇక వదలండి బాబూ! ఇక కబుర్లు తప్ప

అన్నీ బంద్! ఆఁ! ఏమన్నారు? నా సహకారానికి థాంక్స్ అంటారా? అసలు చక్రధారి మీరే కదా? మీకూ థాంక్స్!''

ఈసారి ఆనంద్ గొంతు వినిపించింది పున్నయ్యకి.

''ఆ రోజున మీ నాన్న నిన్ను నాకు పరిచయం చెయ్యకపోవటంతో చాలా ఫీలయ్యాను సుందూ! మీ నాన్నకి ఆ మాత్రం మర్యాద తెలియనందుకు చాలా కోపం వచ్చింది. కానీ కోపంవల్ల ప్రయోజనమేముంది? అందుకని దిగమింగుకున్నాను.

అమ్మాయిగారి దర్శనం కోసం...పొంచి వుండి...మరుసటి రోజున మీనాన్న బజారు వెళ్ళినప్పుడు నీదగ్గరికి వచ్చాను. చిన్నప్పటి పరిచయం వుండి ... ఒకరి కొకరు అభిమానించు కోటం గుర్తున్న మువ్వు నన్ను చూడగానే కరిగిపోయావు. మీ నాన్న నిన్ను నాకు ఎందుకు పరిచయం చెయ్యలేదనే సరికి నిన్ను నీవు నిగ్రహించు కోలేక కన్నీళ్ళతో మీ నాన్న ప్రవృత్తి నాకు విపులంగా తెలియజెప్పావు. వల గుర్తూ ఆయన్ని పులి అంటుంటే...ఆయన నీపట్ల ఎంత కఠినంగా ప్రవర్తించేది...నిన్ని ఆంక్షలతో నిన్ను బంధించిందీ...పెళ్ళి సంబంధాలు చూడటానికి ఇల్లు కదిలిబయలు దేరితే ... నిన్నెవడన్నా వల్లో వేసుకు పోతాడని... అసలాయన ఆ ప్రయత్నం చెయ్యక పోవటంలాంటి విషయాలు చెప్పేశావు. మీ నాన్న విపరీత మనస్తత్వం గమ్మత్తుగా అనిపించింది నాకు. నువ్వంటే ఎంతో ప్రేమ ఉన్న నా మనసు తల్లడిల్లిపోయింది నువ్వున్న విచిత్రమైన పరిస్థితి చూస్తే... ఏది ఏమైనా సరే! ఈ అమ్మాయి గారిని సొంతం చేసుకుని, ఈ గాజుల చేతో గోరు ముద్దలు తినాలనిపించింది ''నేనంటే ఇష్టమేనా? నిన్ను వివాహం చేసుకుంటాను ఒప్పుకుంటావా?'' అని సూటిగా అడిగాను నిన్ను ''అమ్మో! మా నాన్న ఒప్పుకోవద్దూ?'' అన్న నీ సిగ్గుతోకూడిన భయం నాకు అంగీకారాన్ని తెలిపింది. ఓ పథకం వేసి నీకు చెపుతాలే అన్నాను నీవు సరేనన్నావు. ఆ పథకం ఏమిటో ఇంకా ఇప్పుడు నీకు ప్రత్యేకంగా చెప్పేదేముంది? ప్రత్యక్షంగానే చూశావుకదా! పాపం మీ నాన్నకేం తెలుసు? ''నువ్వు నా మీద చూపించిన నిరసన అంతా నాటకమని?

# సామెతల కథలు

## గీచిన గీత దాటటం

మారీచుడు, బంగారు లేడి రూపంలో సీతారాముల పర్ణశాలవద్దకొచ్చాడు. ఆ మాయలేడిని చూచి సీతాదేవి మోజు పడింది. ఆ లేడిని పట్టుకొచ్చి సీతాదేవి కోర్కె తీర్చటానికి శ్రీరామచంద్రుడు దాని వెంటపడ్డాడు. ఆ మాయలేడి ముందూ, శ్రీరాముడు వెనకా, చాలా దూరంవెళ్ళారు. తరువాత శ్రీరాముని బాణానికి ప్రాణాలు విడుస్తూ ఆ మాయలేడి "హా లక్ష్మణా" అని శ్రీరాముడు అరచినట్టుగా అరచింది. ఆ ఆర్తనాదం పర్ణశాల వద్దనున్న లక్ష్మణునకూ, సీతాదేవికీ వినిపించింది.

ఆ అరుపు మాయలేడిదని, అది మోసమనీ లక్ష్మణుడు దాన్ని పట్టించుకోలేదు. కాని సీత అది రాముని గొంతుకని, అతడు చాలా అపాయస్థితిలో ఉండి ఉంటాడని, వెంటనే లక్ష్మణుని వెళ్ళమని చెబుతుంది లక్ష్మణుడు, అలా ఏన్నటికీ జరగదనీ, దానిలో ఏదో మోసముందనీ, రాక్షస మాయల్లో యిదొకటనీ, ఏన్నో విధాలుగా సీతాదేవికి చెప్పాడు. సీతాదేవి అతడి మాటలను పెడచెవిన పెట్టింది. భార్యగా బాధపడుతూ, నిష్ఠూరంగా, లక్ష్మణుని అనరానిమాటలన్నది.

లక్ష్మణుడు, ఆ కర్ణ కఠోరమైన మాటలు భరించలేక, సీతాదేవిని నప్పించలేకా, మరొక మార్గం లేకపోవుటచే, మంత్రించి, మూడు గీతలు గీచి, ఏట్టి పరిస్థితులలోనూ, ఆ గీతలనుదాటి బయటకు రావద్దని సీతాదేవిని హెచ్చరించి, శ్రీరాముని కొరకు ఆ శబ్దంవచ్చిన వేపుకు వెళ్ళాడు.

ఈ అవకాశానికి ఏదురుచూస్తున్న రావణుడు మాయవేషంలో భిక్షాటనానికని పర్ణశాలవద్దకు వచ్చాడు. సీతాదేవిని భిక్ష పెట్టమన్నాడు. సీతాదేవి భిక్షగీతలలోపల నుండే పెట్టబోయింది రావణుడు ఆభిక్షను తీసుకోలేదు గీతలలోపలనుండి భిక్ష పెట్టరాదని, అలా భిక్షను తను పట్టనని ఏన్నో చెప్పాడు. భిక్ష పెట్టటం ధర్మం. అందువల్ల మరొక మార్గంలేక సీతాదేవి, గీచిన గీతలుదాటి భిక్ష పెట్టటానికి బయటకు వచ్చింది. గీచిన గీతలుదాటి బయటకొచ్చి భిక్ష పెట్టబోతున్న సీతాదేవిని రావణాసురుడు ఏత్తుకుపోయాడు. లక్ష్మణుడు అనివార్యమవటంవల్ల మంత్రించి గీతలుగీచి వెళ్ళాడు. గత్యంతరంలేక సీతాదేవి ఆ గీతలు దాటటంవల్లనే ఆమెకాపాయం కల్గింది. యీ కథ పైనుంచి వచ్చినదే యీ పలుకుబడి దానికే 'లక్ష్మణరేఖ' పలుకుబడికూడా ఉంది.

ఈ నాటికి, భిక్ష పెట్టేటప్పుడుగానీ, ఒకరికి డబ్బు యిచ్చేటప్పుడుగాని, ఒక వస్తువును యిచ్చేటప్పుడుగాని మనం వారిని లోపలికైనా పిల్చియిస్తాం. లేకపోతే, మనం గడపదాటి బైటికైనా వెళ్ళి యిస్తాం. అంతేగాని, యిచ్చేవారు లోపల, పుచ్చుకునేవారు గడపబైట ఉండగూడదు ఇది మన ఆచారం. ఈ నాటికీ ఆ సంప్రదాయాన్ని మనం అనుసరిస్తూనే ఉన్నాం. ఆ, ఆచారాన్ని ఆసరాగా తీసుకునే, రావణుడు సీతాదేవిని గీచిన గీతదాటి బయటకొచ్చేటట్టు చేయగల్గాడు. అది సంప్రదాయం కాబట్టే సీతాదేవి ఆ గీతలు దాటి బైటకొచ్చింది.

**— పద్మావతి గంగాధర్.**

---

ఆ వాంతి దొంగ డోకు అని? అనలమ్మాయి గారికి నెలే తప్పలేదని-అంతా ఈరాజాగారు. రాణీగారు...కలిసి లాలూచీ అయిచేశారని." పకపకా నవ్వాడు ఆనంద్. పున్నయ్య నిర్ఘాంతపోయాడు.

"ఏమయితే ఏం ? అయ్యగారు... మా నాన్నని ... పులిలాంటి మానాన్నని...పిల్లి పిల్లని చేసి ఆడించటమే కాకుండా...వాళ్ళమ్మాయిని వాళ్ళోకి జేర్చుకుని లాలిస్తున్నారు. హాట్సాఫ్ హీరోగారికి. అయితే ఒక షరతు...?!"

"ఏమిటోయ్ అది ? ఒక్క 'ము...' ఇస్తేనే ?"

"ఊ! చాలెండి ! విజయం మీరే సాధించారు గాబట్టి... రేపే కథంతా మానాన్నతో చెప్పి...మనిద్దరం ఆయనకి పాదాభివందనం చేద్దాం. ఓ విధంగా క్షమించమన్నట్టూ

### పులి కూతురు

ఉంటుంది. ఆశీస్సు అందుకున్నట్టూ వుంటుంది."

"నో!" ఆనంద్ వ్యతిరేకించాడు.

"నో...అంటే, అయ్యగారికి అన్నీ నో.. అనాల్సి ఉంటుంది సార్" గలగల నవ్వింది సుందరి.

"బాబోయ్ ! అంత శిక్ష భరించలేను సరే !"

"అలా రండి దారికి" కిలకిల నవ్వింది.

"సరే! తమరిలా రండి వొళ్ళోకి" ఆనంద్ గొంతు వెక్కిరిస్తున్నట్టుగా వుంది.

"అబ్బ! ఊరుకోండి..." అంటోంది తన కూతురు. ఆ తరువాత గదిలో అంతా నిశ్శబ్దం అలుముకుంది. పున్నయ్యకి సిగ్గేసింది- చిన్న పిల్లాడిలా పరుగెత్తి తన గదిలోకి వెళ్ళాడు. మంచం మీద కూర్చున్నాడు. పున్నయ్య కిప్పుడు ఏంతో ఆనందంగా వుంది అతని అంతరంగం సంతోషంతో గంతులేస్తోంది.

తన కూతురు... పులిలాంటి పున్నయ్య కూతురు నిజంగా పులిబిడ్డే...!! ఏలాంటి తప్పూ చెయ్యలేదు- తనకు కనువిప్పు కలిగించటం మినహా! తన కూతురు పులి బిడ్డ అయినప్పుడు, తనేమవుతాడు ? —

పు లి ! పు లి ! పు లి !

పున్నయ్య చెయ్యి సగర్వంగా దుబ్బు మీసాల మీదకి పోయిందీసారి. మరి కొన్ని నిముషాలయ్యే సరికి- పున్నయ్య గురక... కాదు పులి గాండ్రింపు వినిపిస్తోంది గదిలో !!!

# వంటలు

## బ్రెడ్ పుడ్డింగ్

కావలసిన వస్తువులు :- పాలు - అర లీటరు; బ్రెడ్ పెద్ద సైజుది - ఒకటి; పంచదార - 80 గ్రాములు; కోడిగుడ్లు - 2; ఎండు మిర్చి పండ్లు - 15; నీరు - 2 కప్పులు; యాలకులపొడి - చిటికెడు

బ్రెడ్ చిన్న చిన్న ముక్కలుగా త్రుంచి పాలు కాచి, ఒక గిన్నెలో పాలు బ్రెడ్ ముక్కలు పాలు పోసి అరగంట ఉంచవలెను.

కోడిగ్రుడ్లు ఒక గిన్నెలో వేసి బాగా గిలకొట్టి పైన నానపెట్టి ఉంచుకొన్న పాలు బ్రెడ్‌లో వేసి, పంచ ర, కిస్‌మిస్, యాలకులపొడి వేసి బాగా కలిపి ఆ మిశ్రమాన్నంత ఒక గిన్నెలో పోసి మూతమూసి ఉంచవలెను స్టౌమీద కుక్కరు పెట్టి దానిలో 2 కప్పులు నీరు పోసి మనము కలిపి ఉంచుకొన్న గిన్నె కుక్కరులో పెట్టి స్టీము గానే వెయిటు పెట్టి పది నిమిషములు ఉంచి దింపవలెను. చల్లారిన పిదప మూత తీసి ముక్కలు కోసుకొని తినవలెను

— మాదిరెడ్డి లక్ష్మి రమాపతి.

## ఆలూ టిక్కియా

కావలసిన వస్తువులు :- బంగాళా దుంపలు - పావు కేజీ, ఉల్లిపాయలు - 2, పచ్చిమిరపకాయలు - 3, కొంచెం జీలకర్ర సరిపడా ఉప్పు.

తయారీ విధానం:- బంగాళాదుంపలను బాగా మెత్తగా ఉడికించి తోలుతీసి వాటిని చేతితో మెత్తగా మెదపాలి. పచ్చిమిరపకాయలను సన్నటి ముక్కలుగా తరిగి ఆ ముక్కలను, ఉల్లిపాయ ముక్కలను జీలకర్ర, ఉప్పు వేసి పూరీ పిండి వలె మెత్తగా చేతితో కలిపి అరచేతిలో కొంచెం నూనె రాసుకుని గుండ్రముగా బిళ్ళలవలె చేతితో తట్టి పెనం మీద నూనెతోగాని నెయ్యితోగాని తడిపి బిళ్ళలన్నిటినీ పెన్నంపై ఒకేసారి పరచి రెండు వేపులా ఎర్రగా వేయించి తీసుకోవాలి. వేడి వేడిగా వీటిని తింటే చాలా రుచిగా వుంటాయి. వీటిలో కొత్తిమీర పొదీనా పచ్చడిలను కూడా కలుపుకుని తినవచ్చు.

— వేంకట సుబ్బమ్మ

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

# వారఫలం

**8-6-1979 శుక్రవారం మొదలు 14-6-1979 గురువారం వరకు**

**మేషం :** ఈ వారం మీరు శక్తికిమించిన పని ప్రారంభిస్తారు. వెనుకముందులు చూచుకొని పనికి దిగటం, లాభమాశించటం మంచిది గదా! అనేకజనితంగా ప్రవర్తించటం మాను కొండి. ఆదాయంఆశించినంత ఉండదు. జాయింటు వ్యాపారం ఫలిస్తుంది. ఆలోచించి పనికి ఉపక్రమించటం న్యాయం. స్త్రీలకు యథాతథంగా అన్ని పనులు నెరవేరుతాయి.

**వృషభం :** అధికంగా ఈ వారంలో లాభం ఆశించవచ్చు. స్వభావం ఎరిగి సంచరించటం న్యాయంగాదు. ఆదాయం చాలదని, అనుకున్న పనులు జరుగలేదని అనుకోరాదు. స్పెక్యులేషన్ ఫలించదు. కొంతకాలం లగ్న రవి సంచారంవల్ల ధిక్కృత వలన శరీరారోగ్యంచెడవచ్చు. స్త్రీలకు గృహ కార్యాలలో మానసికంగా ఇబ్బందులుండ వచ్చు.

**మిధునం :** విశ్రాంతి నెరుగని కృషి. ఆరోగ్యం క్రమంగా వృద్ధి పొందుతుంది. లాభదాయకమైన దినాలు. మిత్రుల సహాయం, ఆర్థికంగా జరుగుతుందని చెప్పదగిన వారం. స్త్రీలకు, శుభకార్యాలోచన ఉంటుంది. అంటే ఉత్తమవారంగా పరిగణన.

**కర్కాటకం :** ఆ ఒకటే జరుగని కార్యాలుండ వని తెలుస్తుంది. లగ్నంలో గోచార గురువు ఒక విధంగా సహాయకుడే. ఉద్యోగాత్ప ద్రవ్య లబ్ధి. బంధు లాకిడి. వ్యయాప్తి గుర్తించలంది. శ్రమ కూడ ఉంటుంది. స్త్రీలకు ఈ రాశివారికి చాలమందికి కడుపులో నొప్పి కనిపించవచ్చు. అవుషధ సేవ అవసరం కావచ్చు.

**సింహం :** ఉష్ణాధిక్యత వలన, వాత ప్రకోప లక్షణాలు కనిపించుట చేత శరీర రుగ్మత సంభవం. చాల జాగ్రత్త వహించటంన్యాయం. ఆకస్మిక ధనలాభం ఆశించవచ్చు. స్త్రీలకు గతకాలం కన్న ఈ వారం ఆదాయ విషయంలో ఆనందోత్సాహ విషయంలో వృద్ధి సంభవం.

**కన్య :** గోచార ప్రకారం, ఈ రాశివారికి వ్యయాశని, అనేక విధాల అనిష్టంగా పరిణమిస్తుంది. శని గ్రహం అనుకూలంగా లేని కాలం ప్ర రంగంలో ఉత్సాహం ఇస్తుంది. పిల్లల విషయంలో విశ్రద్ధ రణిస్తుంది. స్త్రీలకు మేలైన కాలం అవటంలో సందేహం లేదు.

**తుల :** ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహచారం బాగుంది. వారం అంతా పండుగ రోజులుగా ఉంటాయి. మాటకు గౌరవ ప్రతిపత్తులు కల్గుతాయి. పెద్దల సాంగత్యం, సాహిత్య కళారంగాల్లో రాణింపు, గౌరవాధిక్యత ఈ వారం.

**వృశ్చికం :** స్వార్థం, పరులతో సహకరించని గుణం. అన్ని రంగాల్లో విజయం సాధించవలెనను తాపత్రయం ఏ విధంగా చూచినా అభివృద్ధి కార్యక్రమంలో నిమగ్నత లభించదు. మరి, వారం అంతా మనస్తాపంతో, అనవసర ప్రయాణంతో జరిగి పోతుంది. స్త్రీలు చిన్న జగడాలతో సతమత మవుతారు.

**ధనుస్సు :** వారం, గతవారం కన్నా, గ్రహబలం బాగుంది. సాహిత్య ప్రియులకు రాణిస్తుంది. కవిత ఫలిస్తుంది. నాల్గు ముక్కలు వ్రాసి కాలక్షేపం చేసేవారికి, పత్రికాధిపతులకు సర్వసామాన్యంగా లాభదాయకం. స్త్రీలపై చదువులు ఆశించేవారికి, విద్యా యోగ్యత గుణాయామంగా లభిస్తుంది.

**మకరం :** సాంఘిక వ్యవహారాలు బాగుంటాయి. కృషి చేసి ఈ వారం సాధిప సాధ్యము కాని పనులుండవు. గ్రహబలం అనుకూలం అని చెప్పడానికి సందేహం లేదు. దూర బంధువులో అప్తమిత్రులో ఇంటికి రావటం, వారికి సంబంధించిన వ్యవహారాల్లో తలదూర్చటం జరుగుతుంది. స్త్రీలు కూడ ముందువెనుకలు చూచే వ్యవహరించవలసిన వారం అని గ్రహించుకోవలె.

**కుంభం :** అనుకూలమైన వారం. గ్రహబలానుసారం జరుగుతుందని పూరుకోరాదు. కృషి ఎంతో లబ్ధి అంత. మాట సాగుతుంది. లాభదాయకంగా చివరి నాల్గు రోజులు జరుగుతాయి. నూతన కార్యాలోచనలుంటాయి. స్త్రీలకు చాలమందికి ఈ రాశివారికి వయసు మళ్ళినవారికి రక్త సంబంధం, రక్తపోటు సంబంధంగా కొంత ఇబ్బంది సూచకం.

**మీనం :** ప్రయత్నాలు సానుకూలమవుతాయి. రోజులు లాభదాయకంగా నెరవేరుతాయి. సాటివారిలో గౌరవ ప్రతిపత్తి ఉంటుంది. సాహిత్యరంగంలో, నృత్య నాట్యరంగాల్లో అనుభవం గల స్త్రీలు పలు విధాలుగా రాణింపుకు రావటం జరుగుతుంది. మంచిరోజులుగా పరిగణన.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి.

Add more
to your life

Drink
Nova Cola







*Artificially flavoured

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది - సం.







# హైదరాబాద్ నోట్ బుక్

## విద్యామంత్రి హామీ :

తెలుగు భాషా వికాసానికి, బోధన భాషగాను, అధికార భాషగాను తెలుగుభాష అభివృద్ధికి ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమీల సంయుక్త యాజమాన్యంలో జరిగిన గోష్ఠి చేసిన సిఫార్సులను అమలుపరుస్తామని రాష్ట్ర విద్యాశాఖామంత్రి శ్రీ మదన మోహన్, గోష్ఠి ముగింపు సమావేశంలో ప్రసంగించినప్పుడు హామీ ఇచ్చారు. ఈ గోష్ఠి ఉస్మానియా విశ్వవిద్యాలయం స్వర్ణోత్సవాల సందర్భంగా జరిగింది. సాంకేతిక, పారిభాషిక పదాలను అనువాదం చేయడం మాని, యథాతథంగా వాడుతూ ముందుకు సాగిపోవాలని, వైద్యవిద్యను కూడ తెలుగులో బోధించడానికి ప్రయత్నించాలని ఆయన కోరారు. అనువాదాలు సరళంగా వుండాలని, ప్రజా సామాన్యానికి ఉపయోగపడే గ్రంథాలను వ్రాయాలని ఆయన సూచించారు. "[illegible] మనకు మేలుకన్న కీడే ఎక్కువ చేసింది పాలకులకు, [illegible] అంతరాలు సృష్టించింది. [illegible] ప్రత్యేక వర్గాన్ని సృష్టించింది. [illegible] కనుక ఆంగ్లభాషా వ్యామోహం [illegible]" అని విద్యామంత్రి కోరారు. [illegible] డాక్టర్ వి రామరాజు అధ్యక్షత వహించారు. తెలుగు అకాడమీ డైరెక్టర్ శ్రీ ఎన్. వెంకటస్వామి స్వాగతం చెప్పారు. డాక్టర్ సి. నారాయణరెడ్డి ధన్యవాదాలు చెప్పారు. రాష్ట్రమంతటా పాఠశాలా కళాశాలా స్థాయిలో తెలుగుభాషను నిర్బంధంగా బోధించాలని, తెలుగు మాధ్యమంలో పట్టభద్రులైనవారికి ప్రత్యేక సదుపాయాలు కల్పించాలని, తెలుగు మాతృభాష కానివారు తెలుగు నేర్చుకోవడానికి ప్రోత్సాహమివ్వాలని ఈ గోష్ఠి తీర్మానించింది.

## కళింగ స్తూపం :

శ్రీకాకుళం జిల్లా కళింగపట్నంలో ఇటీవల ఒక గొప్ప బౌద్ధస్తూపం వెలువడింది. దీనిచుట్టు కొలత 23మీటర్లు. భారత పురాతత్వశాఖ ఆగ్నేయ ప్రాంతం సూపరింటెండెంటు డాక్టర్ ఐ కృష్ణమూర్తి కళింగపట్నంలో ఇటీవల జరిపిన త్రవ్వకాలవల్ల ఈ స్తూపం బైటపడింది. ఈ స్తూపంమీద ధర్మచక్రం నాగార్జునకొండ మహాస్తూపం చక్రాన్ని పోలివుంది. క్రీస్తుశకం మొదటి శతాబ్దం, క్రీస్తుపూర్వం మొదటిశతాబ్దం మధ్య కాలంది ఈ స్తూపమని, బుద్ధుని జీవితగాథలేవీ ఈ స్తూపం మీద లేకపోవడం విచిత్రంగా ఉందని డాక్టర్ కృష్ణమూర్తి అన్నారు. నిజానికి ఇది అశోకునికన్నా ముందుదై ఉంటుంది. పూర్వపు స్తూపాలలో హీనయాన సంప్రదాయం ప్రకారం బుద్ధుని చిత్రాలేమీ వుండవు. దీర్ఘవర్తులాకారమయిన స్థలం, దానికి అడుగున బుద్ధునికి సంకేతంగా కేవలం పద్మం, పైన గంధర్వులు దండలు వేస్తున్నట్లున్న శిల్పాలున్నట్టి పూర్వం బుద్ధుని శిల్పాలు లేవు పద్మంపై బుద్ధునిపాదాలు, క్రమంగా హారీతి శిల్పించబడినవి. కనుకనే గాథాసప్తశతిలో బుద్ధుని పాదాలు మాత్రమే వర్ణితాలు. గాథాసప్తశతి కాలానికి కూడా స్తూపారామాలతో బుద్ధుని పాదాలు తప్ప మరేశిల్పములేదు బుద్ధునిది. కళింగపట్నం స్తూపం మీద బుద్ధుని జీవిత శిల్పాలు లేక పోవటం బట్టే, ఇది మహాయానం ప్రబలం కాకముందో, నాగార్జునకొండస్తూపాలకు ముందో నిర్మితమై వుండవచ్చు.

## పశిష భామా కలాపం :

భామాకలాపంలో కొన్ని సంప్రదాయాలున్నవి. వాటిలో ఒకటి తూర్పుగోదావరిజిల్లాలో ఒకప్పుడు ప్రచారంలో ఉన్నశైలి ఒకటి. ఇది మరుగుపడిపోగా, దీనిని శ్రీ నటరాజరామకృష్ణ సంస్కరించి సముద్ధరించి కొందరు శిష్యురాండ్రకు శిక్షణనిచ్చి, ప్రదర్శింప జేశారు. దీనిని శ్రీమతి రోజారాణి మే నెల ప్రారంభంలో నగరంలో ఆర్ట్స్ అకాడమీ పక్షాన త్యాగరాజ గానసభ ఆడిటోరియంలో ప్రదర్శించారు. ఈశైలిలో సంగీతం, నృత్య పద్ధతి జానపదఫక్కీలో వుంటాయి. శ్రీమతిరోజారాణి శాస్త్రసమ్మతంగా నృత్యం ప్రదర్శించారు. శ్రీ టి. వి. ప్రసాద్ మృదంగం నృత్యానికి మనోహరంగావచ్చింది. శ్రీ నటరాజ రామకృష్ణ నట్టువాంగం నిర్వహించారు. సమావేశానికి అధ్యక్షత వహించిన ఆంధ్రాబ్యాంకి పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ శ్రీ కె. వి. భాస్కరరావు ప్రసంగిస్తూ, దాక్షిణాత్య అపుత్తరాహ నృత్యాలకు అవకాశం కల్పించినందుకు నగరంలో ఆర్ట్స్ అకాడమీని ప్రశంసించారు. శ్రీయుతులు వీరహనుమాన్, నటరాజ రామకృష్ణ, గుడిపూడి శ్రీహరి ప్రసంగించారు.

## ఉపశ్రుతి :

"శివర్ అస్పత్రి వెనుకభాగంలోని ప్రభుత్వం సారా దుకాణం ద్వారంలో ద్వారపాలకులుగా ఒకవైపు శివాజీని, మరొకవైపు మహారాణాప్రతాప్‌ను గీచారే. వాళ్లు మధుపానం చేసినట్లు చరిత్రలో ఎక్కడాలేదే." అన్నారు ఒక చరిత్రాధ్యాపకులు నాతో. "వాళ్ళు తాగకుండా [illegible] సర్కారి సారాదుకాణం పై వాళ్ళబొమ్మలేం ఎట్లావస్తాయ్? నీపాటి చరిత్ర తెలిసినవారు ప్రభుత్వంలో లేరా?" అని ప్రక్కన ఉన్న ఒక రాజకీయాభిమాని అతనిని గదమాయించాడు.

— తిరుమల రామచంద్ర


Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street
Gandhinagar, Vijayawada-3 Editor S Radhakrishna

# విపులాచ పృథ్వీ..!



లండన్, పారిస్, రోమ్, న్యూయార్క్, ఆగ్రా,
పెకింగ్, సింగపూర్, మాస్కో...ఈ సువిశాల
విశ్వంలో ఇవి కొన్ని ముఖ్య ప్రాంతాలు మాత్రమే.
వీటిని గురించే మనకు అంతగా తెలియదు. నిజానికి మన
చుట్టూరా ఉన్న బెంగాలీ, అస్సామీ, రాజస్థానీ, గుజరాతీ,
సింధీ, కాశ్మీరీ, మరాఠీ మున్నగు భాషా ప్రాంతాలవారి సంగతలా
ఉంచి, పొరుగునే వున్న తమిళ, మలయాళ, కన్నడ భాషా ప్రాంతాల
వారిని గురించి కూడా మనకు తెలిసింది చాలా తక్కువ. వీరందరినీ, ఈ
ప్రాంతాలన్నిటినీ మీకు అత్యంత సన్నిహితం చేసే అపూర్వ సాధనం
'విపుల'. నెలనెలా 15 వరకూ విభిన్న భాషల అత్యుత్తమ కథలను తేట
తెలుగులో కేవలం 125 పైసలకే అందజేస్తోంది విపుల.
కథలు మాత్రమేగాక అదనంగా కడుపుబ్బ నవ్వించే జోకులు,
కార్టూన్లు, విచిత్ర విశ్వ విజ్ఞానం 'విపుల' అదనపు ఆకర్షణలు.
కంటికి, మనసుకు హాయిగొలిపే రంగుల ఆఫ్‌సెట్
ముద్రణ 'విపుల' మరో ప్రత్యేకత
ప్రతినెలా 1వ తేదీకి వెలువడే విశ్వకథా విపంచి

# విపుల

132 పేజీలు...125 పైసలే



Marketed By
Margadarsi Marketing PRIVATE LIMITED Eenadu Compound, Hyderabad-500 004

